శ్రీ కుసుమహరనాథప్రభుని

# అపురూపావతారము



శ్రీ పెండ్యాల సీతారామయ్య
గుంటూరు

పబ్లిషర్సు :
**భగవాన్ అండ్ కో.,**
**చిత్తూరు**

# మనవి

అసలు ఆధ్యాత్మిక విషయమే భావసంబంధమైంది. ప్రాపంచిక విషయాలవలె సులభగ్రాహ్యమైందికాదు. ఒకఆధ్యాత్మిక గ్రంథాన్నికాని పత్రికనికాని తొందరపాటుతో ఒకటి రెండు నిముషాల్లో పేజీలు త్రిప్పి వదలివేయటంకాని,నలుగురితో మాట్లాడుతూ మధ్య మధ్య చదువుతూ పూర్తిచేయటంకాని, అచ్చటచ్చట కొన్ని విషయాలను చదివి రచయితల చాకచక్యాన్ని చర్చిస్తూ కాలక్షేపం చేయటంకాని చూస్తున్నప్పుడు నాకుమాత్రం ఎందుకో దుర్భరంగా కనబడుతుంది. బంగారపు వస్తువులను అటూయిటూ కెలికి యేమూలనో పారవేస్తూన్నట్లు తోస్తుంది.

కాలక్షేపానికీ, వేడుకలకీ, రైలుప్రయాణాలలో ప్రొద్దు పుచ్చుకుంటానికీ, వార్తలూ, వస్తువులధరలూ, ప్రకటనలూ తెలుసుకుంటానికీ ఉపయోగించే గ్రంథాలతోకాని పత్రికలతోకాని ఆధ్యాత్మిక గ్రంథాలనీ పత్రికలనీ చేర్చిన అదృశ్యమే విపరీతంగా కనిపిస్తుంది.

కనుక పాఠకులకు నా హృదయపూర్వక ప్రార్థనయేమంటే ఆధ్యాత్మిక విషయాల కీయవలసిన శ్రద్ధనిప్రత్యేకించుకుని ఆయా పఠనలకి తగినంత అవకాశమున్నప్పుడే ఆరంభించటం మంచిదని.

నాకు మొన్న మొన్న సుమారు నాలుగువందల పేజీలు కల ఒక ఆధ్యాత్మిక గ్రంథం-చక్కని బైండు-చాలా ఆకర్షణీయమైంది కనబడింది. తెరచి చూతునుకదా-దానిలో ఆదినుండి అంతంవరకూ "హరేరామ హరేరామ రామరామ హరేహరే! హరే కృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే" అను మహామంత్రం ముద్రింపబడిఉంది. దానిలో మరొక మాటకాని, అక్షరం

కాని లేనేలేదు. ఆపుస్తకాన్ని ఎంతశ్రద్ధగా పఠించాలో ఒకమారు ఆలోచించిచూడండి.

కనుక అధ్యాత్మిక గ్రంథపఠనంలో-విశేషించి జగదీశ్వరునకు నివేదించుకునే విషయాలని చక్కగా అనుభవిస్తూ మెల్లగా విరామస్థలాలలో ఆగుతూ, అనుభవించకొలదీ మరల మరల చదువుతూ పూర్తిచేయటం అవసరం. పదములు హృదయంలో కల మహాభారమైన భావాలని ప్రకటించటానికి చాలీ చాలని గుర్తులు. వీనిద్వారా ఆయాభావాలని అనుభవంలోకి తెచ్చుకోవలసివస్తుంది.

అతిరుచివంతమైన పదార్థాన్ని ఎట్లు చప్పరిస్తూతింటామో తినటం అయిపోయినా నాలుకతో నోటిలోని యిరుకుభాగాలలో ఉన్న పదార్థాన్ని బయటకులాగి ఆరసశేషాన్ని మరలచప్పరిస్తామో అట్లే హృదయ నివేదనానికి సంబంధించే విషయాలనికూడా పఠించటం యుక్తం. ప్రియుని లేఖను ప్రేయసీ, ప్రేయసిలేఖను ప్రియుడూ ఎన్నిమారులు చదివినా తనివి తీరుతుందా?

పైవ్రాసిన విషయాలని పట్టి గ్రంథపఠనంలో నేను సూచించిన సూచనలకు మూలమైన నామనోవేదనను పాఠకులు గుర్తింతురుగాక.

మరొక చిన్నవిషయం. ఈ చిన్న పొత్తంలో నేనువాడిన భాష చాలా వాడుకభాష. కొంచెం ధారాళంగా చదువనేర్చిన వారందరికీ, అందుముఖ్యంగా స్త్రీలకి సులభగ్రాహ్యంగా ఉండటమే నాలక్ష్యం. బహూశ భాషాపిపాసువులకి రుచికరంగా ఉండకపోవచ్చును. నా యాశయాన్ని తీసుకుని వారుకూడా రసం గ్రహిస్తారని ఆశ.

గ్రంథకర్త.



THAKUR
SHREE MAHANATH

MATUSHREE
KUSUM KUMARI DEVI

శ్రీ శ్రీ శ్రీ కుసుమహరినాథులు

శ్రీ కుసుమహరనాథ ప్రభుని

# అపరావతారము

## హృదయ నివేదనము

ప్రభూ! హృదయేశ్వరా! నీవు పరిపూర్ణ ప్రేమస్వరూపుడవు. ఎల్లవేళలా నా హృదయాన్నే నివాసంగా చేసుకుని నాలో ఒక భాగంగా ఉన్న నీకేమి విన్నవించుకొందును? కాని యేకారణంచేతనో నీ కేమేమో తెలియపరచుకోవాలనే కోరిక పుట్టుతూ ఉంది. ఏమేమో భావపరంపరలు మూగుతూ ఉన్నాయి. వ్యక్తపరచుకోలేక పోతున్నాను. నీ ప్రేమ తలపుకు వచ్చినపుడెల్ల హృదయసాగరం పొంగిపోతూ ఉన్నది.

కష్టసుఖాత్మకమైన ఈజీవితం నీనాయకత్వంలో ముందుకు సాగిపోతూన్నది. ఈ మిట్టపల్లాలలో ఎంత చక్కగా ఈ రథాన్ని నడిపిస్తున్నావో, జరిగిపోయిన జీవితఘట్టాలు స్మరణకు వచ్చినప్పుడు నీ యవ్యాజ ప్రేమరసము నిర్దుష్టంగా పొడగట్టుతూ ఉంటుంది. నా దృష్టి కఠిన పరిస్థితులలో ఎట్లు నిలబడగలిగితినా అనిపిస్తూఉంటుంది. కాని ప్రభూ! ఇట్టి అనుభవాలని పొందీ కూడా భవితవ్యాన్ని గురించి ఒక విధమైన భీతి కలగటం మానటం లేదు. ఇది నా దౌర్బల్యమని తెలిసి కూడా ఈ దౌర్బల్యాన్ని పోగొట్టుకోలేక పోతున్నాను.

ప్రభూ! నిన్నేమి ప్రార్థింతును? నా మనస్థితి నీ వెరుగుదువు. నీచేతులతో తయారుచేసిన బొమ్మను. గొప్పవాడనైనా కొద్దివాడనైనా-నీవు దిద్ది తీర్చినవాడను కదా! నీ భావనంలో

పరవశత్వం పొందుతూ ఉన్న నేను - నీకుదూరం చేసే క్షణిక వ్యామోహాలలో పడిపోతున్నాను-మరల మెలకువ పొందుతూ న్నాను-పశ్చాత్తాప పడుతున్నాను. ఈ పశ్చాత్తాపము అల వాటై పోతూన్నది. పరిపూర్ణ ఆత్మశాంతి ఎప్పుడు ప్రసా దిస్తావు ప్రభూ!

దయామయా! నేను నీ యొడిలోని చంటిబిడ్డను. నీ అమృత హస్తాలతో నా కన్నీటిని తుడిచి, నన్ను ఊరడిస్తూ నాకు మనోధైర్యం ప్రసాదించు ప్రభూ!

* * * *

ప్రభూ! ఎప్పుడు కనుపిస్తావు తండ్రీ! ఎప్పుడు నా నేత్రాల దాహం తీరుతుంది?....నిజం....నీ దర్శనం నా కిప్పుడే ఎలా దొరుకుతుంది?

నేనే స్థితిలో ఉన్నాను? అంతా నా చేతిలోనే ఉన్నదని మురుస్తూన్నాను. నాయిష్టమే రాజ్యం అనుకుంటున్నాను. హిత బోధలేవీ చెవి కెక్కటంలేదు. కల్పతరువును వదలి గడ్డిమొక్కల నాశ్రయించినట్లు ప్రపంచంలో నాతోడి మానవులే నాకు తోడుగా నిలుస్తా రనుకుంటున్నాను. నీవంటి "చిరసఖుని" వదలి కనబడిన వారి నందరినీ సఖులుగా భావిస్తున్నాను.

కాని ప్రభూ! ఈ సమయములోకూడా నీవు నాయెదుట ఉండి దీన స్వరంతో "పొరపాటు, పొరపాటు" అని చెప్పు తూనే ఉన్నావు. వారంతా నాకు ఆనందం ఇచ్చేవారు కారని చెప్పుతూ ఉన్నావు. ఔను. నా ప్రభువుకంటె నాకు చిరసఖు లెవరున్నారు? నా ప్రభునికంటె సహృదయు లెవరున్నారు?

అసమాన ప్రేమాస్పదుడవైన నీవు నావెంట నుండగా నిన్ను గుర్తించలేక పోతున్నాను.

నీ దర్శనం నాకు అప్పుడే ఎట్లు లభిస్తుంది బాబా!

ఐహిక సుఖాలలో పడి తుచ్ఛభోగాలకి దాసుడనైనాను. ముగ్ధుడ నైనాను. భోగాలే పరమావధిగా తలచాను.

కాని ఆ తుచ్ఛ భోగాలకొరకు వేటాడే సమయాలలో కూడా నీవు నావెంటనే ఉన్నావు. నావెంట తిరుగుతూ నన్ను రక్షించటానికి ప్రయత్నించావు. అనేక మారులు దీనంగా నా వైపు చూస్తూ "పొరపాటు, పొరపాటు" అని మేలుకొలప డానికి ప్రయత్నించావు. నా గర్వంలో అవి సరిగా వినబడ లేదు. నేను వినిపించుకోలేదు నాకళ్ళు మదపు పొరలలో కప్ప బడి ఉన్నాయి. నీ దీనవదనం చూడలేక పోయాను.

నాబోటి అంధునికి నీ దర్శనం ఎలా లభిస్తుంది?

ధనమే మూలమని తలచాను. ధనం గుట్టలు గుట్టలుగా పోగుచెయ్యాలని ప్రయత్నం చేశాను. ప్రయత్నం కొంతవరకు ఫలించింది ఊహాప్రపంచంలో ఆ గుట్టలమీద కూర్చున్నాను. అంతకంటె వేరే స్వర్గం లేదనిపించింది. అట్టహాసాలు చేశాను. ప్రజలంతా నన్నే దైవంగా పూజిస్తున్నట్లు కనిపించింది.

ఆ సమయంలోకూడా-బాబా! నీవు నాకు ఎదురుగా నిలబడే ఉన్నావు. నాకేమో భయం కలిగేది. ఆ భయాన్ని తీర్చుకోవడానికి ఆ ధనంతో నిన్ను కూడా ఊరించాలని చూశాను. ఎంత నీచమైన ఆలోచన! నీకే లంచమియ్యాలని

ప్రయత్నించాను. విశ్వానికంతకూ యజమానివి నీవేననీ, నీ ఖజానా అపారమైనదనీ, మైకంలోఉన్న నాకు తెలియలేదు.

బాబా! అప్పుడు కూడా నీ మధుర వచనాలతో మెలకువ తెప్పించటానికి ప్రయత్నించావు కాని, ఎప్పుడూ నీ ప్రయత్నాలను విఫలం చేయటమే కర్తవ్యంగా పెట్టుకొని నిన్ను బాధించాను చివరకు నీదర్శనమే కంటకంగా తోచి నీనుండి తప్పించుకోవడానికి ప్రయత్నించాను, అపార దయాసముద్రుడవు కనుక, నన్ను వెంటాడి వెంటాడి, నాకోసం అష్టకష్టాలు పడి నన్ను రక్షించావు, నాకళ్ళు తెరిపించావు.

ఇంతటి శ్రేయోభిలాషివి నీ దర్శనం ఎప్పుడు కలుగుతుంది తండ్రీ!

ఈ జీవనసంధ్యలో కొన్ని-క్షణాలైనా నీదర్శనం యిచ్చి యీ నేత్రదాహాన్ని తీర్చవా ప్రభూ!

*  *  *  *

ప్రభూ....దీనబంధూ....కుసుమహారా .... నా జీవితము నుద్ధరించవా తండ్రీ....ప్రాపంచిక సుఖమరీచికలను చూచి ఆశపడి తిరిగి తిరిగి తుదకు నీ శరణ్యానికి వచ్చాను...నాయనా.... అహంభావిననీ - గర్విష్టిననీ నన్ను త్రోసివేయకయ్యా .... ప్రపంచంచేత నెట్టివేయబడ్డ నన్ను నీవు కూడా నెట్టివేస్తే ఇంక నాకేదిగతి? హే హారనాథ మహాప్రభూ....నీవే నా దిక్కు... రెండు చేతులూ జోడించి ప్రార్థిస్తున్నాను. బాబా నాకు చేయిచ్చి, నీపాద చ్ఛాయలలో త్రిప్పుకో....

బాబా....నాబోటి పతితుల నుద్ధరించటానికే కదా నీవు అవతరించింది. అదే నాధైర్యం....ప్రభూ....నీ ఆశ్రయం దొరు కుతుందనే పెద్ద ఆశ యీ జీవిత రథాన్ని నడిపిస్తూన్నది. నీ సాయం లేనిదే ఒక్క నిముషంకూడా గడవదుకదా.... నాయనా....నీదయయే నా కాధారం....నీవు నిజమైన ఆప ద్బాంధవుడవనే దృఢ విశ్వాసంతో ఉన్నాను. నీ పాదాల చెంత చేరటమే నా యేకైక లక్ష్యం.

నాయనా.... అజ్ఞానాంధకారంలో కన్నులుండి కూడా త్రోవ తెలుసుకో లేకున్నాను. ఇంద్రియాలు నా స్వాధీనంలో లేవు. ఐహిక బంధాలలో బంధింపబడి పోయాను. నా హీనస్థితి నాకు చక్కగా తెలుస్తూన్నది. ఇప్పుడు కావలసినది హృదయ దార్ఢ్యం....నాకు హృదయదార్ఢ్యం ప్రసాదింపవా....చే యూత నిచ్చి ఒక్కొక్క అడుగు ముందుకు వేయిస్తూ వెంట త్రిప్పుకో నాయనా....

నాబోటి అహంకారి-అహంభావి లేడు....అదే నా యీ పతనావస్థకి కారణం అయింది.... అన్నివిధాలా భ్రష్టుడ నయ్యే పరిస్థితి యేర్పడుతూన్నది. నా దృష్టికి నేను ఒక రాతి బండలాగు కనబడుతూన్నాను.

జన్మ యెత్తినందుకు నాకీ భూమిమీద కావలసింది ఒక్కటే...అది నీ సన్నిధి సుఖం...

ఏమేమో కోరికలు కోరి నిన్ను విసిగించాను. ఈ అంత్య కాలపు గడియలైనా నీ కొరకు వినియోగించుకుంటాను... నీవే గమ్యంగా భావించుకుంటాను...ఈ శరీరం చెడుతూన్నది

కాని హృదయం నీకోసం పరితపిస్తూనే ఉన్నది. ఇందులో నీకు తప్ప మరెవ్వరికీ తావులేదు. ప్రభూ...ఇదే దీనిని నీకు సమర్పిస్తున్నాను.

* * * *

## తీ వ్ర వాం ఛ

ప్రభూ.... కుసుమహారా...ప్రేమమయుడవు—దయామూర్తివి-నీవు నాకు అండగా ఉండగా, నా మనస్సు యీ ప్రాపంచిక కష్ట సుఖాలలో పడి, శాంతిప్రదమైన నీపాద పద్మాలకి దూరమై పోతూంది. నాయనా....నిజమైన కష్ట సుఖాలు యేవో తెలుసుకోలేకుండా ఉన్నాను. ఈ ప్రాపంచిక కాంక్షల వెంటబడి, వాటికోసం చేతులు చాచుకొని అందటం లేదని ఏడుస్తున్నాను. ఆ కోరికలు నీనుండి నన్ను ఎంతో దూరం చేస్తున్నాయి. అయినప్పటికీ నీవు నన్ను వదలకుండా వెన్నంటి ఉంటూనే ఉన్నావు. నా కోసం కన్నీరు కారుస్తూనే ఉన్నావు. ప్రేమమయుడవు...నీవు నన్ను వదలకుండా ఉన్నావనే దృష్టి లేక, ఎదురుదెబ్బలు తింటూ, "ప్రభూ" అని ఒక్కసారి వెనక్కి తిరిగి చూస్తే కన్నీరు కారుస్తూ నావెనుకనే అతి దీనంగా—నా వైపే చూస్తున్నావు...

ప్రభూ...కుసుమహారా...నీ పవిత్రాలోచనలనే చేస్తూ—నీ అతిశీతల, సుందర సుఖప్రద ముఖపద్మాన్నే తీరనిదాహంతో చూస్తూ, స్వార్థరహితమైన నీ గుణగణాలని వెల్లడి చేసే గాన—సంభాషణలనే వింటూ—దేవ దుర్లభమైన నీమేనును తాకి వచ్చే వాయువునే పీలుస్తూ, ప్రకృతిమాత ఒడినుండి నీకు తగిన పత్రి పుష్పాలను అతి శ్రద్ధతో తెచ్చి, నీ పాదాలమీదనే పెట్టుతూ,

మహామునులకు సైతం దొరకరాని నీ సాంగత్యాన్నే కోరి పరుగులెత్తుతూ, సర్వజీవులకు ప్రాణానికి ప్రాణమైన—కర్తవ్యానికి కర్తవ్యమైన — లక్ష్యానికి లక్ష్యమైన "కుసుమహర" నామాన్ని "కుసుమహరా" అనే పలుకుతూ, నీకోసం ప్రతి నిముషం రెండు కన్నీటి చుక్కలు రాలుస్తూ ఉండనిస్తావా ప్రభూ .... కుసుమహరా .... ఈ నిజమైన సుఖాన్ని అందనిస్తావా ప్రభూ !

## శ్రీ హరనాథుని ఆశయమూ - మనభావాలూ

భగవానుడు సర్వవరదుడు - స్తోత్రప్రియుడు - మహాదాత - పూజార్చనాసక్తుడు. నమ్మినవారికి సర్వసౌఖ్యాలూ కరతలామలకం. ఆ భగవానుని దయ సంపాదించటానికి వ్రతాలు చేసీ, భజనలుచేసీ, పుణ్యకార్యాలు చేసీ మానవులు జీవితాన్ని సౌఖ్యవంతం చేసుకుంటారు. ఇహంలో అన్ని సౌఖ్యాలూ పొంది, పరంలో ముక్తిని సంపాదిస్తారు.... ఈ విషయాలు మనంచేసే ప్రతి వ్రతంలోనూ కథా కల్పాలు వినేటప్పుడు ప్రకట పడతాయి.

ఈ విశ్వాసం హిందూజాతికి నర నరాల్లోనూ వ్యాపించింది. ఇది యిల్లే ఉంటే బాగా ఉండేది. తాను మొదట వ్రతాలు చేయటమూ, పిమ్మట తన కోరికలు తీరటం కొరకు కనిపెట్టుకుని ఉండటమూ జరిగేది. ఇది క్రమ క్రమంగా కొంచెం తారుమారై తన కోరిక తీరితే వ్రతం చేస్తానని మాట యివ్వటం- అదితీరితే చేయటం-లేకపోతే మానటంగా-పరిణమించింది. భగవంతుడు కూడా తనలాంటి సామాన్యమైన మనిషే. అనుకుని అతడు తన మాటను నమ్మి తన పనిని చేసిపెట్టుతాడనీ, అప్పుడు

తాను అన్నమాట నిలబెట్టుకోవచ్చుననీ వాని ఊహ. సారాంశం–భగవంతుడు ఇచ్చేవాడూ – మనం తీసుకునేవాళ్ళం. ఇది యెప్పుడు రూఢైపోయిందో అప్పుడే ఆ పూజలూ – వ్రతాలూ చేయకపోతే పాపం, భగవంతుని నిందిస్తే దుఃఖం అనేవిశ్వాసం కూడా యేర్పడిపోయింది. చేయటం వలన సుఖాలు వస్తాయి అన్నప్పుడు చేయకపోతే దుఃఖం అనే సంగతి వేరే చెప్పాలా? రెండోది మొదటి దాని నీడేకదా !

మన జీవితంలో ఊహ తెలిసి నప్పటినుండీ నేటివరకూ యీ విశ్వాసం మనలో జీర్ణించిపోయి 'భగవంతుడు' అనగానే ఈ భావాలే పుట్టుతూ ఉంటాయి. ఈ భావాలు రాకుండా చేసుకుంటానికి చాలా సాధన చేయవలసి వస్తుంది. అవి అంత మనోలీనత్వం పొందాయి.

ఈ విశ్వాస బీజాలని పూర్వ మహాఋషులే నాటారు. అవి యెప్పుడో మొలకలెత్తి, మొక్కలై, పెద్ద పెద్ద వృక్షాలై పోయాయి.

ఇవే ఆస్తిక్య వృక్షాలు. ఈ వృక్షాలు కల్పాంతందాకా ఉండేవేకాని సులభంగా పోయేవి కాదు. దేవుడు లేడంటే మాత్రం ఒప్పుకోరు.

కాని ఒక్కొక్కప్పుడు తాను దుర్బలుడవటం వలన తన కోరికలూ, లక్ష్యాలూ సిద్ధించకపోతే అది తన సాధనలోపం అనుకోక, భగవంతుని దాతృత్వాన్నో లేక అస్తిత్వాన్నో శంకించడమూ, విరుద్ధ ప్రచారానికి పూనుకోవటమూ జరుగుతుంది. కాని ఆవిధంగా యెన్నాళ్ళుఉండగలడూ? నిత్యావసన్న

డవటం వలన మొదట తిరస్కరించిన దేవుణ్ణే తిరిగి ఆశ్ర యిస్తాడు. ఈ ప్రపంచంలో మనకి ఒక్క పుట్టుకా-ఒక్క చావూ అయితే భగవంతునికి మనభావాలలో లెక్కలేనన్ని పుట్టుకలూ-లెక్కలేనన్ని చావులూ. ఏమైనప్పటికీ యుగయుగాల నుండీ పాతుకుపోయిన ఆస్తిక భావానికి చలనం లేదు.

పై చెప్పిన దైవలక్షణాలని కొలతబద్దగా తీసుకుని మనం దైవాంశా సంభూతులనీ, అవతారమూర్తులనీ కొలవాలనుకుంటాం. మన కోరికలు తీరిస్తే ఒకడు అవతారమూర్తి-లేకపోతే మామూలు మనిషి. ఆ మూర్తి ఆశయాలేమిటో మనకు అక్కరలేదు. అతడు 'గ్రక్కున విడువంగవలసిన మొక్కిన వరమీని వేల్పు'.

కాని బాగుగా ఆలోచిస్తే పరిశుద్ధ భక్తి సౌధానికి యీ విశ్వాసాలు ఎక్కడో చాలా అడుగు భాగంలో ఉన్న మెట్లు. ఇవే గమ్యాలు కావు.

శ్రీ హరనాథమూర్తి తన చర్యలతోనూ, లేఖల తోనూ ఈ మెట్లను అతిత్వరగా ఎక్కించాలని తన జీవితం ధారపోశాడు. అప్రాకృత శరీరంతో యింకా ఆ ప్రయత్నాన్నే సాగిస్తున్నాడు. కాని మనం పైకి ఎక్కలేక పోతున్నాం. ఆ కొలతబద్దతో కొలవటం మూలాన్నే ఆ ప్రభువులోఉన్న దైవ త్వం మనకి అర్థం కావటం లేదు.

కుసుమ హరనాథుడు మనకి సుఖభోగాలు సమకూర్చే క్షుద్ర దేవత కాడు. సులభంగా వశం చేసుకుని ఆయనద్వారా పేరు ప్రతిష్టలు సంపాదించుకోవాలనుకోవటమూ, ఆయన అండ

చూచుకుని యితరులమీద అహంభావం వెళ్ళబోయటం, మూర్ఖత్వం.

మన ప్రభునకు కావలసినది ప్రేమ. పరిశుద్ధప్రేమ. మన పూజార్చనల మాత్రానికే తృప్తి పడేవాడుకాదు. నిష్కామంగా ప్రేమిస్తూ, ఆప్రేమతో విశ్వాన్నంతటినీ కూడా చూస్తామని ఆశిస్తాడు. అందుకే "కృష్ణుణ్ణి మామూలుగా ఆవులను కాచుకునే గొల్లపిల్లవానిగా చూడమంటాడు. నన్ను నువ్వు ఒకసారి తండ్రిగా భావించినప్పుడు 'అవిలేవూ-యివిలేవూ' అని అడగటం యెందుకూ! నాకు తెలియదా?" అంటాడు. ఇంకా ఇంకా ఏమేమో చెప్పి, మన కెట్లాగైనా ఆ నిష్కామ ప్రేమ అలవాటు చేద్దామని శతవిధాల ప్రయత్నం చేస్తాడు.

మనలో అదివరకు ఉన్నభావాలు పోక 'ఇది యివ్వలేదు-అది యివ్వలేదు' అని పెడదార్రులు పట్టిపోతూఉంటాం. ఆయన పేరుమీద చేసినపని కూడా కాకపోయిందే అని బాధ పడతాం.

ఎవడైనా అడిగిందల్లా యిస్తూ ఒకణ్ణి మళ్ళా కోరిక పుట్టకుండా చేయగలడా? పోనీ, ఒక తల్లికాని, తండ్రికాని ఆ విధంగా తన బిడ్డకి యిస్తూన్నాడనుకుందాం. ఆ బిడ్డ యేవిధంగా తయారవుతుంది? అసలు యేపని చేయటానికైనా సిద్ధపడుతుందా? ఆలోచనా శక్తికాని స్వతంత్రత్వంకాని కలుగుతుందా? కాబట్టి బిడ్డలకి కార్యజ్ఞానం పుట్టాలి. ప్రపంచంలో ఉన్న జీవరాసులన్నీ తనలాంటివే అని సహానుభూతీ, దయారసం కలగాలి. మంచీ-చెడ్డా విచక్షణ లేకుండా సృష్టిలో ఉన్న

వన్నీ కూడా చాలా అందంగానూ, రసవంతంగాను కనబడే ట్లుగా తయారు కావాలి.

కొద్దిపాటి జ్ఞానంతో సంచరించే మనమే మన బిడ్డల విష యంలో యెన్నెన్నో విధాల, బాల్య చాపల్యాలలో నుండి క్రమంగా పైకి రావాలని ప్రయత్నంచేసి ప్రాజ్ఞు లెప్పుడవు తారా అని నిరీక్షిస్తూ ఉంటామే! లోకోద్ధరణానికి పాటుబడుతూ ఉన్న సర్వజ్ఞమూర్తి. శ్రీ హరనాథమూర్తి కృషి యెంతటిదో!

భగవంతునిమాయ చాలా విచిత్రమైంది. ప్రపంచంలో కనబడుతూన్న యే వస్తువూ శాశ్వతంకాదు. వట్టి మోసం... ఈ విషయం సాధారణంగా అందరకూ తెలిసినదే. కాని అశాశ్వ తమైన వివయాలే మనకు, శాశ్వతంగా కనుపిస్తాయి. మనబోటి మానవులే మనకు సర్వప్రియులుగా కనబడతారు వారు మనకు ఏమాత్రం సంతోషం యివ్వగలరూ? ఎంతకాలం మనకు ఆనం దం చేకూర్చగలరూ? ఆలోచిస్తే అంతా చీకటే. కాని మన నడవడిలో ఏమాత్రం తేడా ఉండదు. ఇట్టి విచారకర దృశ్యం మరెక్కడా కనబడదు.

ఉదాహరణకు మానవ స్వభావాన్ని చూద్దాం. మాన వుడు స్వజనాన్ని కాని, తన మిత్రులనుకాని ప్రాణాలకంటె ఎక్కు వగా తలచి ప్రేమిస్తాడు ఆజీవి లేకపోతే తన జీవితమే శూన్యం అని తలుస్తాడు. ఆజీవి ఆరోగ్యం భంగమైతే చాలా వ్యాకుల పడతాడు. ఆ తరువాత....తరువాత తప్పనిసరిగా తాను తలచిన తన ప్రాణసఖుని వియోగంలో బ్రతకవలసి వస్తుంది. కొద్ది దినాలు ఆ వియోగ బాధ అనుభవిస్తాడు. ఆ తరువాత మరచి

పోతాడు. మరల తన మనసును ఏదో మరొక అశాశ్వత విష యం వైపుకు మరలిస్తాడు.

ఒక్కసారి ఆలోచిస్తే, మన యీ వర్తమాన జీవితానికి ముందు ఎన్నిమార్లు భూమిపై జన్మించామో - ప్రతిసారీ ఏదో క్రొత్త రూపం. పక్షిరూపంలో, పశురూపంలో, పురుష రూపంలో అనేక రూపాల్లో మనమీ భూమి మీదకి వచ్చాం. ఆరూపాల్లో....భార్యా బిడ్డలూ, తల్లిదండ్రులూ, ఇల్లూ వాకిలీ....అన్నీ ఉన్నాయి. అయితే మనకు ఆజ్ఞాపకమే లేదు. అవన్నీ ఎక్కడకు పోయాయో మళ్ళా యీజన్మలో క్రొత్త క్రొత్త సంబంధా లేర్పరచు కుంటున్నాము..., కాలక్రమంగా పూర్వపు విషయాలు ఎలా మరచామో, అల్లే ప్రస్తుత విష యాలూ, సుఖాలూ, సంబంధాలూ మరచిపోవలసిందే. ఇన్నీ తెలిసి కూడా 'గర్భస్థ దశనుండీ చిరసఖుడైన ప్రభువు'ను గుర్తిం చలేక పోతున్నాము. ఒక్కసారి నిర్మల మనస్సుతో ఆలోచిస్తే అతనికంటె ఆత్మబంధు వెవడు.

సాధారణంగా మానవమాత్రుని హృదయంలో ఏ మూలనో పరమేశ్వరసంగకాంక్ష దాగుకొని ఉన్నది. కాని మానవుడు దాన్ని పైకి రానీయడు. అశాశ్వత సుఖకాంక్ష లతో దాన్ని అణచేస్తాడు .... అయినా అది సమయం చూచు కుని హీనస్వరంతో ఎప్పటికప్పుడు తన ఉనికిని జ్ఞాపకం చేస్తూ హెచ్చరిస్తూనే ఉంటుంది.

నిజం .... శిశువు జన్మించాడు. అంతవరకూ నరక బాధను అనుభవిస్తూన్న తల్లికి స్వర్గం లభించినట్లు అవుతుంది. ఎంతో ఆనందపడుతుంది. ముద్దులాడుతుంది. హాయిగా, ఒడలు మరచి

నిద్రిస్తున్న శిశువును చూచి నేత్రాల దాహం తీర్చుకుంటుంది. అమాయకపు చూపులు చూస్తూ, నవ్వుతూ, నవ్విస్తూ ఆ శిశువు పురోభివృద్ధికి దైవాన్ని ప్రార్థిస్తుంది. ఎంతభాధలో ఉన్నా ఆ శిశువు సంతోషానికి నవ్వుతూ కనిపిస్తుంది. కాని ఆ అంత్య ఘడియ సమీపించగానే .... ఆ ఆఖరు పిలుపు వినబడగానే అంతటి ప్రేమకు పాత్రుడైన ఆజీవి ఒంటరిగా ప్రయాణం సాగించవలసి ఉంటుంది. ఆ ప్రయాణంలో ఏ స్త్రీ ప్రేమా ఆప టానికి రాదు. ఏకంఠస్వరమూ వినబడదు. ఎవరి విచారం ఫలించదు. ఎవరు ఎంత ఏడ్చినా సరే.

అది చాలా ఒంటరి ప్రయాణం. కాని ఒక్క విషయం. ఒక అద్భుతమైన వస్తువుంది. దాని విషయం మొదట ఎవరికీ గిట్టదు. ప్రారంభ దశలో అది అంత మధురంగా ఉండదు. కాని దాని నెవరైనా వెంట ఉంచుకో గలిగితే తమ భయంకరమైన ఒంటరి ప్రయాణంలో కూడా అది సహాయకారిగా ఉంటుంది. ఆ వస్తువే "భగవన్నామము". ఈ భగవన్నామప్రభావం సాటి లేనిది. నామోచ్చారణమాత్రంచేత అన్య ప్రాపంచిక విషయా లన్నీ వణకుతూ పారిపోతాయి. శాశ్వతానందం లభ్యమౌతుంది.

*  *  *  *

ఎప్పుడైనా భగవానుని కూర్చి చర్చ వచ్చినప్పుడూ — భగవానుడు మానవులనుండి కోరేదేమి? అనే ప్రశ్న వచ్చి నప్పుడూ మనం సాధారణంగా ఇదే వింటాం— "ఎల్లప్పుడూ మంచి పనులు చేస్తూ, నీతిదాయకమైన జీవితంకంటే భగవా నునికి కావలసిందేం ఉంది?" అని.

కాని భగవానుడు కోరేది ఇదే అనటంకంటె భగవానున కింతకంటె మనం యేమీ యివ్వలేక పోతున్నాము అనటం ఉచితం. భగవానుడు మనయొద్దనుండి కోరేది చాలాఉంది. భగవానునితో సన్నిహిత సంబంధం యేర్పరచుకోవటమూ, తనను ప్రభుని సాక్షిగా చేసుకోవటమూ, అమోఘమైన భగవదనుభవాలతోనే జీవించటమూ. ఇవి చాలా ముఖ్యమైనవి.

భగవానుడు మనకు చూపిన ప్రేమ సామ్రాజ్యసీమలకు చేరుకుంటానికి ఎప్పుడైనా ప్రయత్నం చేసినామా? ఐహిక విషయాలైన ఆరోగ్యం- స్నేహాలూ- ఆస్తులూ- వినోదాలూ మొదలైన విషయాల కుప్పను చూడగానే "ఇవన్నీ క్షణికాలు- నేనిచ్చట బ్రతికి ఉన్నది నా ప్రభువు కొరకు"- అనే భావము బలంగా మన హృదయాల్లో నాటుకోవాలి. "ప్రాపంచికవిషయాలన్నిటినీ వదలమన్నా వదలుతాను కాని నా ప్రేమాధినాధుణ్ణి- నా ప్రేమపయోధిని- నా ప్రభుని మాత్రం నేను విడువలేను" అనే దృఢత్వం మనలో కలగాలి.

మన ప్రభువు మనలను చూచి సంతోషించి గర్వించుకుంటానికి మనలో యే సుగుణం ఉన్నది? అప్పుడప్పుడుగుళ్ళలో కూర్చొని ప్రజారంజకంగా పాడి భజన కాలక్షేపం చేసినంత మాత్రానికే ప్రభువు సంతోషించడు.

భగవానుని భక్తులం అనిపించుకుంటూ ఉన్న మనం ఎలా ఉండాలి? "పీరిలోని యీగుణాలు చాలామంచివి. ఏమైనా సరే ఆగుణాలు నాకు కూడా రావాలి" అని యితరులు వాని కొరకు ఉవ్విళ్ళూరేటట్లు ఉండాలి. మనం యితరుల విషయంలో యేగుణాలు లేవని అసహ్యపడుతూ ఉన్నామో ఆగుణాలు

మనలో కనబడాలి. ఈ విషయంలో ఎవరికి వారు తమలోని మంచి చెడ్డలని విమర్శించుకుంటే బాగా తెలుస్తాయి.

మన ప్రస్తుత స్థితిని ఆలోచిద్దాం. ప్రభుని వాక్యం — "నేను వేటకాణ్ణి- మీరంతా అడవి పక్షులు. మీరు నాకు చిక్కక మానరు" అని. భగవానుడు నిజంగా ఒక వేటకానివలె తిరుగుతూన్నాడు. తనవారినిగా మన్ని చేసుకుంటానికి విశ్వ ప్రయత్నం చేస్తూన్నాడు. మనం ఆ వేటకానిచేతికి అందకుండా పారిపోతూన్నాము. పై పెచ్చు మనం భగవానునికొరకు వెతుకుతున్నామని అంటూన్నాము. భగవానుని ఎదుటపడటానికి భయపడి అటూ యిటూ పరుగెత్తుతూ వానిని విసిగించి తిప్పలు పెట్టుతున్నామే కాని "నా ప్రభూ! నాకోసం గోలోకధామం నుండి దిగివచ్చావు- నేను ఈక్షణమే నీకు నన్ను సమర్పణం చేసుకుంటున్నాను." అనే భావం హృదయ స్ఫూర్తిగా కలగటం లేదు. "నేను సగము దూరం నీకొరకు దిగి వచ్చాను. నీచేయి కొంచెం చాపి నాకు అందించాలన్న" ప్రభువుని మనం వెదకి పట్టుకోవలసిన పనేముంది? ఇది బండి ముందర గుఱ్ఱాన్ని కట్టటానికి బదులు గుఱ్ఱానికి ముందు బండిని పెట్టటమే కదా.

సరే జరిగిందేమో జరిగింది. పై విషయాలు వదిలేద్దాం. ప్రభువు చెప్పిన ఒక్క విషయంతో మన క్రొత్త జీవితాన్ని సాగిద్దాం. "పవిత్రత- అపవిత్రత- యీ విషయాలు మనస్సులోనికి రానీయకు. ప్రపంచంలో అపవిత్రత అనేది లేనేలేదు. ఒకవేళ ఉన్నట్టుగా తోస్తే అది ప్రభు నామ ప్రభావంతో అతి పవిత్రమైపోతుంది." ఈ వాక్యాన్ని ఆదర్శంగా పెట్టుకుందాం.

బాహ్యాఅవయవాలతో బాహ్యకర్మ నెరవేరుస్తూ హృదయాన్ని ప్రభునకు సమర్పించుకుందాం.

ఏదైన రహస్య ప్రదేశానికి పోయి హృదయనాథుణ్ణి ఆహ్వానించుకుని అతనిముందు దీనంగా మోకరించి ప్రార్థిద్దాం హృదయాంతర్గతమయిన మన విన్నపాన్ని విన్నవించుకుందాం.

## పాట.

హృదయాంతర్గతమైన యీ విన్నపము వినవే శ్రీ కుసుమహారా.
నీ యెనుట నే దాచంగ యేరహస్యము లేదో యీ శ్రీకుసుమహారా
ఎటనన్ను నిలుపంగ నెంతువో అట నిలుపవే శ్రీ కుసుమహారా
నా కీమాత్రమున కే మనోవ్యథ లేదోయీ శ్రీకుసుమహారా
నా కీవొక్కరుడవె సర్వము సుమ్మిది నమ్మవెూ కుసుమహారా
ననుమాత్రమెన్నడు మరువకుమో మనోనాథా కుసుమహారా.
ఎంతో ముద్దుగజూచియెన్నో నగలతో సింగారించితివికుసుమహారా
నా డెంతో మోదముతో వ జవియన్నియును నే ధరించితి
కుసుమహారా
ఆనాటి నగలన్నియును దూరమైయున్న, అయ్యో కుసుమహారా
మరల, ఈనాడు అటులే నేనేల కులుకగ రాదోయీ
శ్రీ కుసుమహారా
నా యలంకారము లీవు మోదింపనేనోయీ కుసుమహారా
నా యందమంతయు నీవు భోగింపనేనోయీ కుసుమహారా
ఇక నెవ్వరును నీకంటె యిష్టులు లేరోయీ శ్రీకుసుమహారా
నే, నే మొనరించిన నాకొరకు కాదోయీ శ్రీ కుసుమహారా
మోద మొసగిన ఖేద మేయొసగిన మహాప్రసాదమో కుసుమహారా

నా కేదిలభించిన నేమారు పలుకనోయీ శ్రీ కుసుమహారా
నీ యానాదమునకు మాత్రమె నేనిచట నిలచుట కుసుమహారా
ఈయొక్క మాటనే మరువకుండిన చాలునోయీ కుసుమహారా
సని గర్వమంతయు పతి ప్రేమమునసను జూడనో కుసుమహారా
సంతత భవద్దాసి సనుటయే నాసంబరమున కాధారమో
కుసుమహారా
నిను వలపుపిచ్చితో వెంబడించుటకంటె నిజముగ కుసుమహారా
ఇంకను కోరదగిన దీజగతి నెవ్వరి కేమి కలదో కుసుమహారా
ఎప్పటికిని నిన్ను మరువకుండగ చేయవే శ్రీ కుసుమహారా
ని న్నీకోర్కె తక్క నేనేమియు నడుగనోయీ శ్రీకుసుమహారా

* * * *

పరమపూజ్యులైన పాఠకులకు మనవి. మహాశక్తి సంపన్నమైన భారత భూమియందు జన్మించి ఇహపర సాధకమైన మానవజన్మ నెత్తిన మన నేటి మానవజీవితం ఎంత హీనస్థితికి వస్తూన్నదో గమనించండి. క్రమ క్రమంగా ఎంత దుర్బలత్వానికి పాల్పడి పోతూన్నదో ఒక్కమారు విశాలదృష్టితో చూడండి. పూర్వ మెప్పుడో క్రూరజంతువులకు, సర్పాలకు ఎక్కడనో దూరంగా ఉన్న రాక్షసులకు భయపడుతూ ఉండేవాళ్ళని విన్నాం. కాని నేడో ఆ క్రూరజంతువులూ, ఆ సర్పాలూ, ఆ రాక్షసులూ మన్ని భయపెట్టడం లేదు. మన ప్రక్కన ఉన్న మన సాటి మానవులకే మనం భయపడవలసి వస్తూంది. మన తత్వాన్ని మన పొరుగువారు, పొరుగువారి తత్వాన్ని మనం గుర్తించలేని పరిస్థితి యేర్పడుతూన్నది. ధనాశ, అధికార కాంక్ష, స్వప్రయోజనం, ఇంద్రియ చాపల్యం చెప్పశక్యం

కాకుండా చెలరేగి తాండవ మాడుతున్నాయి. దినదినం, క్షణ క్షణం భగవత్సన్నిధికి దూరమై పోతున్నాం.

ఒక కృత్రిమ సభ్యతను మాటుగా పెట్టుకుని, నేటి మానవుడు తన మనస్సుతో ఎన్నెన్ని నోట చెప్పరాని దుష్కార్యాలు ఆలోచిస్తూన్నాడో, దాని ఫలితంగా ఎన్ని కష్టాలకూ, బాధలకూ లోనై పోతున్నాడో—నిజంగా ఊహించిన కొద్దీ అతి శోచనీయ స్థితిని ప్రకటిస్తూన్నది. జారభయం, చోరభయం, రోగభయం, యుద్ధభయం ఇట్టివి లెక్కలేనన్ని మనశ్శాంతిని ఊపివేస్తున్నాయి. ఇక ఎన్ని వ్యామోహాలలోనో పడి సహజంగా మనలో ఉన్న పరిశుద్ధ ప్రేమ భావాన్ని కప్పివేసి దానిని పూర్తిగా అదృశ్యం చేయటానికి ప్రయత్నిస్తున్నారు.

ప్రతి వ్యక్తికీ ధనార్జన ముఖ్య మయిపోయింది. తక్కువ కష్టంతో ఎక్కువ ధనం రావాలి. ఇప్పుడు మనని పట్టుకున్న చింత అదే. ఆధనం ప్రాప్తించటానికి ఉపాయాలు పన్నుతాం. ఆ ధనం కోసం ఎంతపని చేయటానికైనా పూనుకుంటాం కాస్త వీలు కనబడితే. ఏ ఉపాయం చేతనైనా ధనం కొంత పోగైందా— ఇక మనంతటి వాళ్ళు లేరనుకుంటాం. లోకం పొగడటం ఆరంభిస్తుంది. మన చాకచక్యం మెచ్చుకుంటుంది. అంతవాడు లేడంటుంది. ఆ సిరి వచ్చేదినాలలో వ్యక్తికి మరొక ధ్యాసే ఉండదు. కాని ఆ మత్తు ఎన్నాళ్ళో ఉండదు. పరమేశ్వరుడు మేలుకొలపడానికి పరిస్థితులు మార్పు చేస్తూనే ఉంటాడు.

ఎంతకాలం యీ వ్యామోహాల్లో, ఈ కాంక్షల్లో జీవించటం? ఒక్కపర్యాయం విశ్రాంతిగా కూర్చుని సింహావలోకనం చెయ్యండి. జీవితాలు గడచిపోతున్నాయి. కడచిన క్షణం తిరిగి

రాదు. ముందు క్షణం ఎలా ఉంటుందో తెలియదు. శక్తి ఉన్న కాలంలోనే మనస్సును భగవంతుని వైపుకు మరలించుకోవటం తెలివైన పని. గతించినదానికి వగచి ప్రయోజనం లేదు. ఎంత దుస్థితిలో ఉన్నవానినైనా భగవన్నామ స్మరణ ఉద్ధరిస్తుందని సర్వశాస్త్రాలూ ఘోషిస్తున్నాయి. చక్కని మార్గం! సులభ మార్గం! మొదట భగవన్నామ స్మరణ రుచిగా ఉండక పోవచ్చును. మందుపుచ్చుకునే విధంగానైనా అలవాటు చేయ్యండి. మీ నిత్యకృత్యాలలో కొన్నిపాటి సమయం విభజించండి. కాని ఒక్కమాట. నామస్మరణ నామస్మరణ కొరకే చెయ్యండి. లోక సంబంధమైన కోరికల కోసం చేయకండి. పట్టుదల వదలకుండా నామ ధనం ప్రోగుచెయ్యండి.

ఒక ఉద్యోగం కోసం ప్రయత్నం చేసేవాడు కొంత కాలం జీతం భత్యం లేకుండా పనిచేస్తే తరువాత జీతానికి కుదుర్చుకుంటాం అంటే అందుకు సహించి పనిచేయటం లేదా! అదే విధంగా ఓర్పుతో, ఫలాన్ని ఆశించకుండా భగవన్నామ స్మరణ కొంత కాలం చేయండి. కృపావతారమూర్తి ప్రభు హరనాథుడు మనవంటి వారిని ఉద్ధరించడమే పనిగా పెట్టుకుని అవతరించిన వాడు. అది మనభాగ్యం....నిజంగా మనలాంటి బద్ధ జీవులని ఆదుకుని, చక్కని ధైర్యం చెప్పి సాయపడే మహా పురుషుడు ఎలా దొరుకుతాడు? ఆ దివ్య పురుషుని ప్రేమ పిలుపు వినండి. అతడు మన పతనావస్థకు పడుతూన్న బాధ చూడండి. "నాకు ప్రభు హరనాథుని అండ ఉన్నది." అనే నిర్భయ స్థితికి రండి. భగవన్నామాన్ని విడువకుండా స్మరిస్తూ ఉండండి. శ్రీ హరనాథ ప్రభుని దివ్యలేఖలను పదే పదే చదువుకోండి. హాయిగా

మనశ్శాంతిని పొంది జీవిత పథాన్ని చక్కబరచుకోండి. మిమ్మల్నీ అందరినీ దీనాతి దీనంగా కోరుతూన్న దిదే.

*  *  *  *

ప్రభు హరనాథుడు ప్రపంచ మండలి మానవకోటి నం తనూ ప్రేమ సూత్రంతో బంధించటానికి వచ్చిన అపురూపావ తారం. ఇందు దుష్ట శిక్షణా, శిష్ట రక్షణా అనే విషయం తెచ్చి, దాని ద్వారా యితన్ని మత్స్య,కూర్మ, వరాహాది అవతారము లతో పోల్చి నిర్ణయించ వలసిన అవసరం ఏమీా కనబడదు. ప్రస్తుత యుగంలో వీరు దుష్టులూ అని విడదీసి చూపి-చటానికి ఏమీా అవకాశం లేదు. అందుచేత మానవులలో ఎవరిని రక్షిం చటం ? ... ఎవరిని శిక్షించటం ? .... ఎలా నిర్ణయించటం ?

ప్రతి మానవ హృదయంలోనూ బాగా పైకి కనబడు తున్నది, ప్రేమశూన్యత....సానుభూతిలోపం.... మనం ప్రస్తు తం న్యాయం, అన్యాయం అనే సూత్రంమీాద ఒకవిధమైన నటనచేస్తున్నాం.... హృదయంలో ఏభావమున్నా, మనం న్యాయనటనచేస్తే లోకం మెచ్చుకుంటుందనే భావంతో, న్యాయాన్నిపైకితీసి కనబరచటానికి ఎన్నోప్రయత్నాలుచేసి, ఆముసుగుతో మనస్వార్థాన్ని కప్పిపెట్టుకుంటున్నాం....న్యాయ జీవితానికి, ప్రేమ జీవితానికి చాలా వ్యత్యాస ముంది.... న్యాయం పైకికనబరచి పదిమంది ఆమోదంపొందేది, ప్రేమ హృదయానికి సంబంధించింది .... త్యాగపూర్ణమైంది .... న్యాయంలో తనసుఖం, పరసుఖం రెండున్నాయి. ప్రేమలో పరసుఖంతప్ప తనవిషయమే శూన్యం. న్యాయసంబంధమైంది దానం.... ప్రేమసంబంధమైంది త్యాగం........ సానుభూతి.

న్యాయాన్ని బోధించే శాస్త్రాలు, న్యాయాన్ని సమర్థించేచట్టాలు శాసనాలు ఉన్నాయి... ప్రేమకు శాస్త్రాలు చట్టాలు లేవు. మన ప్రభు హారనాథుడు మనమానవ హృదయాల్లో ఆ పరిశుద్ధ ప్రేమను మేల్కొలపాలని వచ్చిన ఏసాటిలేని అవతారం... అతని సందేశాలలో ప్రతిపలుకునందు యీ పరిశుద్ధ ప్రేమే కనబడుతుంది.

మరొకచిత్రం ....ప్రతిసందేశంలోనూ తన్ని తను తగ్గించుకుంటాడు. ఏవిషయంకూడాసరియంతలాగ చెప్పడు, ఇక్కడే మనలో చాలామందికి సందేహం....తానుతనను ఎందుకు కొంచెపరచుకోవాలి ? ఆ మాటల్నే నమ్మితే "అతడు మనకంటే తక్కువవాడా ? " అని అనుకోవలసివస్తుంది. కాని అది భ్రమ.అతడు తనను గురించి వాడేమాటలన్నీ మనలో ప్రతివానికీ వర్తించేవే .... తేడా ఎక్కడంటే మనం వాటిని ఒక కృత్రిమ సభ్యతలో దాచేసి పైకి తెచ్చుకోము. అతడు బాహాటంగా చెప్పుకుంటాడు. అసలు ఆయన సర్వశక్తి సంపన్నుడే! .... సర్వసమర్థుడే ! .... ఒకేకాలంలో అనేకచోట్ల తనదర్శనమిచ్చిన సర్వమయుడే!... అడగకుండా, అదివరకు పరిచయం ఏమాత్రం లేకుండానే అనేకమంది ఆపన్నులకు ప్రాణదానం చేసిన మహాత్ముడే ! అంతటి పరిశుద్ధగుణ సంపన్నుడు, తన్ని తాను అంత నీచంగా ఎందుకు చెప్పుకోవాలి ?

తననుతాను నీచంగా చెప్పుకుంటూ, అందరినీ ఉద్ధరించిన ఏ అవతారంగానీ, ఏమతకర్తగానీ నా దృష్టిపోయినంతవరకు కనబడటం లేదు. అతిదైన్యమూర్తియైన మతకర్త-క్రీస్తుప్రభువుకూడా యీరకంగా మాట్లాడలేదు. నిజంగా యిందులో

విశేషముంది. అందుచేతనే అపురూపావతారం అని చెప్పాను. కాకపోతే యీతత్త్వం కొద్దిగా శ్రీ గౌరాంగమూర్తిలో కనబడుతుంది. అతడైనా ప్రతివిషయంలోనూ తననీచత్వాన్ని తెలుపుకో లేదు.

అయితే యిందులో రహస్యమేమిటి ? మనం అవతార పురుషులని చెప్పుకుంటూఉన్న శ్రీ రామకృష్ణాదులు వారి మానవత్వాన్ని ప్రదర్శించి తాము వచ్చినపనిని చేసుకున్నారు. ప్రజలకు వారియెడల పూజ్యభావము, గౌరవము, ఒకవిధమైన భయము కలిగాయి. శ్రీరామచంద్రుడు, తన దివ్యత్వాన్ని మరుగుపరుచుకొని లోకజననియైన సీతకొరకు అరణ్యంలో చెట్టు చెట్టునూ అడుగుతూ, అతిదుఃఖం వెలిబుచ్చాడు. కాని నేను నీచుణ్ణి, పాపినిఅని చెప్పుకో లేదు. శ్రీకృష్ణుడుకూడా కౌరవపాండవ యుద్ధంలో తనన్నైపుణ్యం కనబరుస్తూ దైవత్వం వెల్లడిచేశాడు. అందువల్లనే మనకు వారియెడల గౌరవప్రపత్తులు కలిగాయి... వారి దుష్టసంహారణ విధానం వలన ఒకవిధమైన భయంకూడా పుట్టింది..... మిగిలిన మతకర్తలమీాద పూజ్యభావం- గౌరవమే కాని మరొకవిధమైన ఆర్తత లేనే లేదు.

ఇక శ్రీహరనాథుడో... యీాయనలో మానవత్వం ... ప్రపన్నత్వం.... దైవత్వం మూాడుగుణాలుకనబడుతున్నాయి.... నిజమైన వైష్ణవునకుండ వలసిన లక్షణాలన్నిటినీ తనకు తగిలించుకొని దివ్యసందేశాలనిచ్చాడు. అహంభావాన్నీ, అహంకారాన్నీ నిర్మూలంచెయ్యటమే యీాయన ఆదర్శం....ఆప్రవర్తనాన్ని మనం అలవరచుకోవాలనే ఆయన ఆశయం. ఇదే నిజమైన భక్తలక్షణం ....నిజంగా భగవత్కృపను కావాలనుకుని

ఇహలోక జంజాటాల్ని తొలిగించుకోవాలనుకునేవాడు, ఎంత పండితుడైనా ఆసందేశాలనువిని ప్రభువును తన హృదయేశ్వరునిగా భావించుకోవలసిందే. మన దగ్గరనుంచి ఒకచక్కని సానుభూతినిపొంది, మనకు చక్కనిసానుభూతినిచ్చి మనహృదయంలో చొరబడటమే ప్రభుసందేశాలలో నూతనత్వం. ఇది ప్రేమలక్షణం. తాను తనపై ఆరోపించుకొనుచున్న నీచత్వాల్లో మనం ఏదిలేకుండా ఉన్నాం?అప్పుడే—వానిని ప్రభువు వాస్తూ ప్రకటనపరుస్తూ ఉన్నప్పుడే అవన్నీ మనలో ఉన్నట్లు జ్ఞప్తికి వస్తూ ఉంటాయి. అప్పుడే మనం ఆ ప్రభువును మనవాణ్ణిగా చేసుకోగలుగుతాం. "ఒకరాజునకు రాజే స్నేహితుడౌతాడు.... ధనికునకు ధనికుడే స్నేహితుడు. అట్లే మీవంటివారే నాకు స్నేహితులని" మనలో ఏకత్వం సంపాదించటానికే తనలోలేని నీచత్వం ప్రకటనచేస్తాడు.

ప్రతివిషయంలోను శ్రీకృష్ణనామం చెయ్యమనీ, తాను మనకేమీ ఉపకారం చెయ్యలేనిస్థితిలో ఉన్నాననీ మనపాపభారాలను మోస్తాననీ, మనద్వారా తరిస్తాననీ చెప్తాడు, మనను సాధారణంగా తండ్రీ అనీ, తల్లీ అనీ సంబోధిస్తాడు.

ప్రకృతిలో తల్లిప్రేమ ఎక్కడపడితే అక్కడ ప్రత్యక్షంగా కనబడుతోంది. తల్లికంటె జీవికి శరణ్యంలేదు. తల్లి అమితమైన ప్రేమతో తనజీవశక్తిని ఖర్చుచేసి బిడ్డనుకని పోషిస్తోంది. తనశక్తిలో ఉన్నదేదీకూడా బిడ్డవిషయంలో లోపంచెయ్యదు. ఆతల్లిమాటల్ని స్మృతికి తెచ్చుకుంటే శ్రీహరనాథుని మాటలు వేరే విననక్కరలేదు. బిడ్డవిషయంలో సర్వసమర్పణ చేసుకుంటూ ప్రాణానికి ప్రాణంకూడా అడ్డంవేసేతల్లి, బిడ్డ చేత దేవునికి జేజేలు పెట్టిస్తుంది. పెద్దల కాళ్ళమీదపడేస్తుంది. బిడ్డ

తనకు నమస్కారము చెయ్యబోతూంటే కంటనీరు పెట్టుకుని "నాయనా, నాకెందుకు నాయనా యీ పరిణామాలు," అని తన్ని తాను కొంచెపరచుకుంటుంది. కాని బిడ్డడు పెద్దవాడై జ్ఞానవంతుడై నాక గుర్తిస్తాడు.... తల్లికంటె వేరేదైవం లేదంటాడు. "సమాతుః పరదైవతం" అనే సత్యాన్ని నిర్ధారణచేసుకుంటాడు. తల్లి ప్రేమయే తనకు సర్వవిధాల సాయపడుతుందనీ తల్లి ప్రేమ తనకు ఒక కవచమై కాపాడుతుందనీ విశ్వసిస్తాడు. అందుచేతనే శ్రీహరనాథ ప్రభువు తన నంత తక్కువ చేసుకొని మాట్లాడినా "జై హరనాథజై కుసుమకుమారిజై" అనీ 'కుసుమ హరా' అనీ స్మరించడం.

అపార కృపారస నిధియైన శ్రీహరనాథుని అమృత సందేశాలు చాలా అర్థవంతమైనవి. అశుంశుభం ఎరగని చిన్న పిల్లవాని ముద్దుమాటల లాగుండికూడా జీవితాలను సరిదిద్దే సమర్థత కలిగి ఉంటాయి. తాను మనకేమీ ఉపకారం చెయ్యలేని స్థితిలో ఉన్నానంటాడు. ప్రభువు మనను వీరులనుగా తయారు చేయవలెనని సంకల్పించాడే కాని మాట్లాడితే "ఇది ఇయ్యి, అదిఇయ్యి" అని దేవురించే భీరువులుగా చేయాలనుకునేవాడు కాడు. మనదుఃఖాలను మనమే ధైర్యంతో భరించుకుని నిష్కామ ప్రేమతో తననూ తనకు సంబంధించిన మానవ ప్రపంచాన్నీ నిష్కామ ప్రేమతో సేవించడం ఆయన ఆశయం. ప్రభూ! నా తండ్రీ! సర్వుల భారాల్నీ మోస్తున్నావు. మా శ్రేయస్సునే దృష్టిలో పెట్టుకుని బ్రతుకుతున్నావు....అటువంటి ప్రేమ మూర్తివి....నీమీదనే ఆధారపడి "నాకు అది ఇయ్యి, ఇది ఇయ్యి" అని వేధించడం నీ నెత్తురు పీల్చడంకాదా?...నీవు

నాకేమీ ఈయ నక్కరలేదు. ప్రసన్న ముఖంతో నీవు నా హృదయపీఠిమీద విరాజిల్లితే చాలు– అదే నాకు కావలసింది– అని, మనం ప్రభుసన్నిధిలో కూర్చున్నప్పుడు ప్రభుని ఆనందానికి మేర ఉంటుందా? ఒక్క వ్యక్తిని నిష్కపటమైన నిష్కళంకమైన ప్రేమతో సేవింపగలిగినవాడు, ఒక వ్యక్తియెడల అంత పరిశుద్ధ ప్రేమను చూపుట రుచి చూచినవాడు, నిస్సందేహంగా మెత్తని హృదయం కలవాడౌతాడు. అప్పుడు ఆ హృదయం క్రమక్రమంగా విశాలమై జీవరాసులన్నిటిని తనలో యిముడ్చుకోగలుగుతుంది. తనంతట తానే విశ్వప్రేమి అయిపోతాడు. మన భారాలన్నీ మోసేవాడు మనకేం తక్కువ చేస్తాడనీ– ఆయనను అదీ ఇదీ అడగటం.... ?

ఇక తండ్రీ, తల్లీ అని సంబోధించడం...అదేకాదు. ప్రపంచంలో ఉన్న స్త్రీజాతి జీవులందరూ తనకు తల్లులైతే తన ఆశయంలో కొంతభాగం తీరినట్లుట. తనమీద మాతృభావం పితృభావం చూపమని ప్రార్థిస్తాడు. ఈ విధంగా నిష్కామ ప్రేమను అలవాటు చేసుకోమని. నిజానికి తల్లిగాని తండ్రిగాని యేమి యివ్వమని బిడ్డను అడుగుతాడు.... "నాయనా....నీవు చల్లగా ఉండడమే నా కోరిక"—అని కదా ఆబిడ్డ విషయంలో ఆశించేదీ....మన ప్రభువుకూడా ఆ ప్రేమనే మన దగ్గరనుండి అర్థించేది....అందువల్లనే ప్రభువు మనల నందరను తల్లీ అని తండ్రీ అని సంబోధించడం....

ప్రభు కుటుంబములోని మనమంతా కలిసే ఉంటామట. తాత్కాలికమైన కొద్దియెడబాటు కలిగినా మళ్ళీకలవడం

నిశ్చయమట. అందువలన యీకొద్ది ఎడబాటు కోసం విచార పడవద్దంటాడు ప్రభువు.

నిజంగా చూడండి– ఏగురువుకాని, ఎవరుకాని, వారు మనకు తరించే మార్గం చెప్పడమూ, మనం ఆ మార్గం ప్రకారం పోతేసరి, లేకపోతే మనకర్మం మనది కావడమూ....కాని ప్రభువు మనం పొందే కష్టాలలో పాలుతీసుకుని ప్రతి చిన్న విషయంలోనూ ఓదారుస్తూ, బాధ్యతవహించిన పెద్దలాగ ఎంత ధైర్యం యిస్తాడో! మనలో మనకు కలుగుతున్న కష్ట సుఖాలు, జీవితో జీవికి సంయోగవియోగాలు, ప్రపంచ ధర్మం కొద్దీ కలుగుతూనే ఉంటాయి- దీనికోసం పరితపించకూ అని యెప్పటికప్పుడు బోధించి తన కుటుంబాన్ని భద్రపరచుకుంటు న్నాడు. నాయనా మన కోరికలూ చింతలూ అన్నీ తీరతాయి. ప్రభువు దయామయుడు; కాని సమయంకోసం కొంచెం ఓర్పు వహించాలి– అని పరిపరి విధాల జాగ్రత్త తీసుకుంటున్నాడు. నిజంగా యీ ఉత్తరాలు అందుకున్నవారు ఎంత ధన్యాత్ములో ........వారికెంత హాయి చిక్కి- మనశ్శాంతి పొందేవారో కదా........

భవిష్యత్తును గురించి ఆలోచిస్తూ బంగారంలాంటి ప్రస్తుత సమయాన్ని పాడుచేసుకోకూడదు. అవును....నడిపించేం దుకు మంచి సమర్థుడు నడుం కట్టుకుని, చెయ్యి పట్టుకుని తీసుకు పోతూంటే, యేమైపోతానో అనే బెంగెందుకు? తల్లి దగ్గరనున్న కుర్రవాడికి భయముంటుందా...గ్రద్దజాడ కించిత్తు తెలుసు కున్న కోడిపెట్ట తన పిల్లల్ని ఎంతచక్కగా దాచుకుంటుంది!...

ఆబిడ్డలు కూడా ఆ రెక్కల క్రింద నక్కిపోతాయి. ఇక మనపని, ప్రభు నామాన్ని స్మరించుకుంటూ అన్యోన్య ప్రేమతో మనలో మనం ఏవిరోధాలూ, ఏ ద్వేషాలూ లేకుండా ఉన్నవారితో కలసి మెలసి ఉండటమే........

జీవితం గడచిపోతోంది....పోయినక్షణం తిరిగిరమ్మంటే రాదు.... ఎప్పుడు కన్ను మూస్తామో తెలియదు. ఎప్పుడో అకస్మాత్తుగా చీకటి పడిపోతుంది...ఎప్పటికప్పుడు సాయంకాలమే. ఇప్పటికే చాలా అలసిపోయాం.... మనకంటెముందర పోయినవారు మనకోసం ఎదురుచూస్తున్నారు.... జాగ్రత్తపడాలి. ఇప్పుడు నామధనం ఎంతపోగుచేసుకుంటే అంతమంచిది. దిక్కులుచూస్తూ నడవకూడదు..... అదుగో ప్రభువు మనం నటనముగించి ఎప్పుడువస్తామా అని చేరెడేసి నేత్రాలతో నిరీక్షిస్తున్నాడు. చేతులను ముందుకుచాచి మనకోసం కొంత దూరం ముందుకువచ్చి మన్ని కౌగలించుకొని ఆనందించటానికి కాచిపెట్టుకొని ఉన్నాడు. ప్రభుడు యింతదీక్షతో నిలబడినప్పుడు మనకు మరణ భయం దేనికి ? మనం అతనిపెంపుడు జంతువులమట....మన కోసం వచ్చే మృత్యువుకూడా తనదగ్గర శలవు తీసుకొని మరీ రావాలట. ఓహో ప్రభువుదయ .... మరణ భయంలేదు....నరకభయంలేదు.... యముడులేడు .... వియోగాలులేవు....ఎప్పుడూ సంయోగమే. ఎప్పుడూ ఆనందమే.... ఎప్పుడూ శాంతిసుఖమే! చాటిచెప్పుతున్నాడు. మీరు నాసందిట్లో ఉన్నారని....జగత్తులోనికి పంపించినవాడు తాను. .... నటింపచేస్తున్నవాడు తాను. చివరకు ఒడిలోనికి తీసుకొనేవాడు తాను.... ప్రభువుమీద నిజమైన విశ్వాసముంచండి. సామాన్య

మైన అవతారం కాదు. ఇటువంటి తోడు దొరకదు. మన అదృష్టవశాత్తు ప్రభువు సాంగత్యం దొరికింది. .... దీన్ని పోగొట్టుకోవద్దు. అందరం ఏకభావంతో ఒక్కసారి ఒక్క గొంతుకతో ప్రభునామ సంకీర్తనం చేద్దాం.... కొన్ని వేల జన్మల ఫలితంగా ఈ విశ్వాసం దొరికిందని నమ్మండి. ప్రపంచంలో దేన్ని అయినా వదలండి కానీ యీ విశ్వాసాన్ని మాత్రం దూరం చేసుకోకండి. పట్టుదలగా భగన్నామ స్మరణ చెయ్యండి.

ప్రభునారనాధుడు తనభక్తకోటిని యెంతచక్కగా ప్రోత్సహిస్తాడు! ఒక్కరవ్వ అయినా మందలింపు ఉన్నదా....కొంచెమైనా నిరాశపరుస్తాడా! మనమంతా ఆయనకళ్ళలో యెలా మెరిసిపోతున్నామో... మన్ని చూసుకుని ఆయనయెంత మురుసుకుంటున్నాడో... తనదగ్గిర ఏగుణం లేక పోయినా తానెంత అయోగ్యుడైనా, మనబిడ్డ ననుకోవడమువలన తాను మహాభాగ్యవంతుడట. ఆమాటలను అలాగేనమ్ముదాం.. అయన్ని మనబిడ్డలాగే భావిద్దాం ....దగ్గరకు తీసుకుందాం ...నాయనా బాబా.... హరా ...హరగోపాలా ... రా నాయనా .... రా ...నాదగ్గరకు రా .... నాహృదయంలో ఉండిపో .... నేను నిజంగానీకు తల్లినౌతాను ... నిన్ను చేతులారా పెంచుకుంటాను... లోకంలోని భారాలన్నీ నెత్తినివేసుకుని మోస్తున్నావు నాయనా....నిన్ను చూచి నిన్ను అలా బాధలపాలుచేసి పైపెచ్చు నా భారాలుకూడా నీమీద వెయ్యనా.... వద్దు...నాభారాలు నేనే మోసుకుంటాను. నిన్ను నలిగిపోనీయను....అని ఆ ప్రేమముద్దను, ఆ అమృతమయుణ్ణి దగ్గరకు తీసుకుందాం...చూడండి నేనిదే చెప్పుతున్నాను....శరీర సం

బంధమైన యీ బిడ్డలను పెంచాం. పెద్దవాళ్ళను చేస్తున్నాం... ఈ బిడ్డని....యీ హర గోపాలుణ్ణి,....మన శాశ్వత ధనాన్ని మరణానంతరం కూడా, అమ్మా, నాన్నా అంటూ మన చుట్టూ చుట్టూ తిరిగి మన దుఃఖాలు మరపించే నాయన్ని పెంచుకుని ఆసుఖం యెల్లా ఉంటుందో చూద్దాం.... లేనిపోని సందేహాల్లో పడవద్దు. శ్రీ హరనాథమూర్తి తన్ని గురించి చెప్పుకునేమాటలు నిజమా అబద్ధమా అని మన మెదడుతో తర్కించవద్దు ఆయన మాటల్ని అట్లాగే నమ్మి ఆయన కోరినట్లే మన హృదయ కవాటం తెరచి ఆ బిడ్డను లోపల దాచుకుందాం ఆయన మన బిడ్డడవడంకంటే మనకింకా భాగ్యమేముంది....... గోపికలెప్పుడైనా కృష్ణుడు భగవంతుడనుకున్నారా? యశోద తన కళ్ళముందర ఆడుతూ బాలక్రీడలలో మునిగి తేలుతూ ఉన్న నీలమణిని భగవంతుడని పూజించిందా. ఎన్ని అమానుషలీలలు కనపరచినా తన పుత్రప్రేమను వదలి వేదాంతపరంగా చింతించిందా...ఆ పిచ్చి ప్రేమనే ప్రభువు మననుంచి కోరుతున్నాడు. ఆపిచ్చి ప్రేమనే మనమీద చూపుతున్నాడు. నిజంగా యిటువంటి మహత్తర అవతారం మన తాతలు ముత్తాతలు ఎరుగరు. మన భాగ్యం. మనం నిజంగా అదృష్టవంతులం కాబట్టే శ్రీహరనాథ కుటుంబంలో చేరాము.

ప్రభువు చెప్పిన మాటలన్నీ యథార్థమని రుజువుచెయ్యడానికి తన అనుభవం కూడా చెప్పాడు. అతనిదెంత దయార్ద్ర హృదయమో చూడండి. మ[illegible]ష్టం తాను ప్రత్యక్షంగా అనుభవించిన సంగతి కూడా నిదర్శన పూర్వకంగా వ్రాశాడు.

చారు కృష్ణమజుందార్ అనేభక్తుణ్ణి మన ప్రభువు బాహ్యంగా చూడనైనా చూడలేదుట. అతనికి ప్రభువుకు ఉత్త రాల పరిచయం కూడా లేదుట. శ్రీ శిశిరకుమారఘోషాల్ ఆ మజుందారు రక్తవమనాలతో బాధ పడుతున్నా డనే వార్త వ్రాసిన వెంటనే మన ప్రభువునకు నెత్తురుడోకులు ప్రారంభమై నాయట. మళ్ళా అక్కడ ఆరోగ్యం సంగతి తెలిసిన తరువాత మెల్లిగా ప్రభువు ఆరోగ్యం చక్కబడిందిట. ఇది ఆయన స్వయంగా వ్రాసిన లేఖ. కట్టుకథ కాదు.

నిజంగా మనం పడుతూ ఉన్న బాధలలో ఎన్నిటిని ప్రభువు భరిస్తున్నాడో మనకు తెలియదు...ఎన్ని బాధలు ఆయన తీసుకుంటే మనం ఈ విధంగా జీవిస్తున్నామో....తన శరీరం యితరుల బాధల ననుభవించడం కోసమే వచ్చిందిట. అది తన కెంతో సుఖమట. ఇదంతా తన ప్రభావం కాదంటాడు. శ్రీకృష్ణుని ఏర్పాటట. ఏపూజనైనా తాను పొందటానికి ఏమా త్రం చూడలేదుకదా..

కొంచెం పూజ్యత కలిగే అవకాశం ఉంటే ఏ మనిషి వదులుకుంటాడు? ప్రభువు క్రీడా ప్రియుడు. చక్కని చిత్రాలు చేస్తూ ఉంటాడు. మనలో కొంతమంది యితరులబాధలకు తమ చేతితో పూజా కుంకుమనో, తీర్థమునో ఇయ్యటమూ అది ప్రభు కృపవలన తగ్గితే ఆ విషయము పదిమందిద్వారా ప్రశం సించబడటం చూచి సంతోషపడటం జరుగుతూంది. శ్రీ హార నాథమూర్తి ముఖ్యంగా మనకు బోధిస్తూన్న విషయం ఏమనగా—“నాయనా ప్రభుభక్తి ప్రచారం చెయ్యి. కాని యెంతవరకూ ఎదుటివారి హృదయం ప్రభువువైపునకే పోవు

న్నట్లుగాచూడు. వారిచూపు నీవైపుకు తిరగకుండునట్లు పని జర పాలి. నీవు కొంచెంకూడా వారిని నీవైపుకుఆకర్షింపకూడదు... జాగ్రత్త–'' అనిచెప్పుతున్నాడు. ఇందుకు నిదర్శనంగా పూజ్యత తను సంపాదించుకొని, అహంభావ పిశాచమునోటబడి, చివరకు తమ అస్తిత్వాన్నికోల్పోయిన దుర్బలులు కనబడుతున్నారు... సర్వశక్తి సంపన్నుడై ప్రజల పూజ్యభావానికి సంపూర్ణ యోగ్యుడైన హరనాథ ప్రభువు ఎంతవరకూ తనను తాను మరుగుపరుచుకొనటానికి గల కారణం మనకుకూడ ఆపాఠాన్నే బోధించటానికి కాదా........

ప్రభువు ప్రతివిషయం తానాచరించే మనకు బోధిస్తు న్నాడు. మనవలెనే అతడూ గృహస్థు... సంసారి.... ఈపరి స్థితులలో ఏ అహంభావమునకూ లొంగకుండా, తన గొప్పకు కించిత్తైనా గర్వపడుతున్నట్లుండకుండా ప్రతిజీవిని తన హృదయ సౌధంలోనికి లాక్కుంటూ అతి నమ్రతతో వ్యవహరిస్తూ నటిం చడం మననికూడా అల్లాగే ఉండాలని బోధించే పాఠాలు కాక పోతే ఏమిటంటాం...జగత్తునంతా సంకల్పమాత్రంచేత ఇచ్ఛా రీతిని నడిపించే శక్తికల మహిమాఢ్యుడు ఇలా నటిస్తున్నాడు అంటే అదిమనం అభ్యసించేటందుకు కాకపోతే మరి తనచేత కాకనా.......?

ఇక్కడ ఒక చిన్న ప్రశ్న. ప్రభువు సర్వశక్తి సంపన్నుడు. ఇతరుల పాపాల్ని తాను సంకల్ప మాత్రంచేత నాశనం చెయ్యవచ్చునుకదా .... అవన్నీ తాను అనుభ వించడందేనికి....? నిజంగా ఒక్కొక్క వ్యాధిని తాను తీసుకుని యమబాధపడేవాడు. అందులో తాను ఒంటరిగా అనుభవించే

వారు.ఆసమయాల్లో అన్ని హంగులూ కలిగి సర్వసుఖప్రదమైన సోనాముఖి కుసుమకుంజిని వదిలిపెట్టి, జగన్నాథంలోని శ్రీహార నాథ అనాథాశ్రమం చేరుకుని అక్కడ ఏకాంతంగా అనుభవించే వారు. ప్రభువు అనుభవించని రుగ్మతలు లేవంటే·నమ్మండి.... అమ్మో, బాబో, అని పెద్దపెట్టున మూలిగేవాడు. బాధలు పట్టలేక దొర్లిగిలగిల కొట్టుకునేవాడు....దేనికి..! చిట్టచివరకు ఒక జన్మోత్సవ సమయంలో అన్నాడు.... "నాజీవ రక్తంలో చివరబొట్టును కూడా వదిలేశాను. ఈ శరీరం పాతబడిపోయింది, చిరుగుల బొంతలాగ అయిపోయింది. ఇంక ఇందులో శక్తి ఏమాత్రం లేదు. దీనిని వదలివెయ్యాలి....వదలివేసినంత మాత్రంచేత నేనెప్పుడూ మీకు దూరమైపోను. అదికల్ల. ఈ శరీరం పోయిన తరువాత నాకు ఒక అప్రాకృత దివ్యశరీరం వస్తుంది. ఆ శరీరంతో ఇంతకంటె కోట్ల వేల రెట్లు పని చేయగలుగుతాను. ఇంతకంటె సర్వవ్యాపకత్వంతో అందరికి తోడు పడతాను...." అని చెప్పాడు.

ఒకప్పుడు పూరీ ఆశ్రమంలో ప్రభువు తన భక్తులతో సుఖంగా కూర్చుని మాట్లాడుతూండగా ఒకడు వచ్చి ప్రభువు ముఖాముఖిని దూషించాడు.అందుకు ప్రభువేమీ చలించలేదు. కాని అక్కడ ఉన్న భక్తులలో ఒకడు ఓర్చుకోలేక పోయాడు. పట్టలేక ఒక విధమైన అక్కసుతో—"ఓరీ! నీ నోరు పడ నిష్కారణంగా యెంత దూషించావురా..." అని తిట్టాడు. తిట్టితిట్టి ఆ క్రొత్తవాడు యింటికి పోయాడు. వెంటనే అతనికి పక్షవాతం వచ్చి నిజంగా నోరు పడిపోయింది. కాని దయామయుడు....మన హరనాథ ప్రభువు....కృపామూర్తి బయలు

దేరాడు... తిన్నగా ఆ తిట్టినవాని యింటికిపోయాడు .... ఆరోగిని చూచాడు. ఓదార్చాడు తిరిగి ఆశ్రమంలోనికివచ్చి పక్షవాతంతో బాధపడ్డాడు. ప్రభుదర్శనం కాగానే ఆతిట్టిన వానికి కులాసాకలిగింది. ఈ విధంగా ప్రభువు తన విపక్షుల వ్యాధులనుకూడ తన మీదతీసుకుని బాధపడేవాడు....ఎందుకు బాధపడేవాడు...?

బాధపడటం ప్రేమలక్షణం.... సానుభూతి లక్షణం........ ఆ బాధపడటంలోనే హృదయాలను కరగించే మహత్తర ప్రభావం ఉంది, అందులోనే హృదయాలను ఆకర్షించుకునే మహత్తరశక్తిఉన్నది. క్రైస్తవులు ఏసుక్రీస్తు విగ్రహాన్ని పూజించరు. ఆయనరూపాన్ని, (ఫొటోను) ధరించరు. ఆత్యాగాన్ని సూచించే శిలువని పూజిస్తారు.... ఆశిలువనే ధరిస్తారు.... ఆముళ్ళ కిరీటాన్ని స్మరిస్తారు... ఆ త్యాగాన్ని తలుచుకొని కన్నీరు కారుస్తారు. కన్నీరే వారి పూజాపుష్పాలు.

ఒకడు బాధలో ఉండి చింతిస్తున్నాడట.... ఆయింటి మీదుగా పోతున్న భాగ్యశాలిచూచి పదిరూపాయల నోటు తీసి అతనిముందు పడవేసి వెళ్ళిపోయాడట. ఆ పదిరూపాయలతో తనయిబ్బంది తీర్చుకొన్నాడు యీ బాధపడినవాడు. తరువాత తాను పదిరూపాయలను సంపాదించి మళ్ళా ఆ భాగ్యవంతుడు కనబడగానే ఆ రూపాయలు ఇచ్చేసి కృతజ్ఞతను వెలిబుచ్చాడు. ఋణంతీర్చిన వానికి ఎంతోసంతోషంతో యింటికి వచ్చేశాడు.పాపం....అతనికి మళ్ళాఏదో కష్టంవచ్చింది... ఈదఫా ఒక పేదవాడు వారియింటికి వచ్చాడు. అతడు తనకుకలిగింది యిచ్చాడు, అతడు వెళ్ళలేక పోయాడు.... అతనితో కన్నీళ్లు

రాల్చాడు... ఓదార్చాడు.... సర్వోపచారాలుచేశాడు—ఆ బాధపడ్డవాడు పాపం ఇలా అనుకున్నాడు.... భాగ్యవంతుని ఋణం వెంటనేతీర్చి, నిబ్బరంగా హస్తచాలనంచేసి రాకలిగాను.... కాని ఇతన్ని నేను మరువగలనా....ఇతడు తన సానుభూతిచేత నన్నే కొనేసుకున్నాడు.... నాకు ఆ సానుభూతిని నేర్పాడు.... ఇతనికి నే నేమిచ్చి తీర్చుకోనూ? .... అనుకున్నాడు.

హృదయం యిస్తేనే హృదయం దొరుకుతుంది. ఈవిమాత్రంచేత హృదయం దొరకదు.... ఇంతకు మనంచేస్తూ అలవాటుపడిన దేవతారాధనలే సాక్ష్యం.... ఒకవ్రతంచేసేటప్పుడు దేవతను ఆహ్వానిస్తాం.... పూజచేస్తాం.... మనకోరిక చెప్పుకుంటాం ....ఆ దేవతచేసిన మహాత్మ్యాలను కథగా చెప్పుకుంటాం. ఆ అక్షతలు నెత్తినివేసుకుంటాం....తరువాత ఆ దేవతకు ఉద్వాసన చెప్పుకుంటాం... మన ప్రభువు ఆ విధమైన ఆరాధనను కోరటంలేదు....మన హృదయాన్ని గెలిచి,దానిని తనప్రేమతో మెత్తపరచి, దానిలో తన విశ్వప్రేమను చొరబెట్టి, మనను మహోన్నత పదవికి తీసికొనిపోవ దీక్షబూనిన మహాప్రభువు కాబట్టే తాను సామాన్య మానవమాత్రుడుగా పుట్టి, మనవలె గృహస్థయి నిరుపమాన సానుభూతిని చూపుతూ, మనని క్షణమాత్రము ఎడబాయకుండా మనబాధలలో బాధపడుతూ, మన సుఖాలనుచూచి ఆనందపడుతూ, తన దివ్యఖేలను జరుపుతూండటం....ఇప్పుడు శ్రీఅవతారనాథమూర్తిని ఎవ్వరనిచెప్పటం. ఆయన హృదయాధిదేవత.... హృదయేశ్వరుడు... బాహ్యపూజాప్రియుడుకాడు.... భావపూజాప్రియుడు.... నిమిష

మైనా యెడబాయని అత్యంతఆప్తబంధువు....నిజమైన శ్రేయోభిలాషి... కాని మనమో, తాత్కాలిక సుఖాన్ని కోరేవాళ్ళం కాబట్టి యేవో గొంతెమ్మ కోరికలు పెట్టుకుని అవి తీరలేదని అసంతృప్తి పడతాం ....మెల్లగా పనిచేసి శాశ్వతారోగ్యాన్ని కలుగచేసే మందుమీదికి దృష్టిపోదు. అప్పటికప్పుడు సత్తువు నిచ్చే ఇంజక్షనుమీదికి పోతుంది.

ప్రభువు తనలేఖలు చాలా చిత్రంగా వ్రాస్తూఉంటాడు. చదువుతూన్నప్పుడు మనకెంతో సుఖప్రదంగా, శాంతిప్రదంగా ఉంటాయి. ఒక ఉత్తరంలో ఒకనికి వ్రాశాడు. "నాయనా తమ్ముని విషయం నాకు గుర్తున్నది. నేను అతని ఆరోగ్యంకోసం కృష్ణుణ్ణి ప్రార్థిస్తాను" అంటూ ఒకమందు చెప్పాడు. ఆమందు చెప్పి, "నాయనా ఈ మందిచ్చినంత మాత్రాన అజాగ్రత్తగా ఉండవద్దు...ఆశ నిరాశ అయినప్పుడు హృదయం దెబ్బతింటుంది సుమా! జాగ్రత్త....భగవత్కృపయే పరమౌషధం.... ఆకృప వలననే అతనికి ఆరోగ్యంకలిగేది.... ఈ మందువలన రోగనివారణ అయితే ఆ కృష్ణునికి రావలసిన ప్రశంసలన్నీపోయి ఆమందుకే వస్తాయని, తానై పూనుకుని ఆరోగాన్ని తగ్గించేస్తాడని" వ్రాశాడు....అందుకు తల్లి బిడ్డకు తింపిపెట్టేటప్పుడు చేసే యుక్తిని చెప్పాడు. "నాన్నా నీవు తినకపోతే ఈ ముద్ద ఆ అబ్బాయికి పెట్టేస్తాను" అంటుందిట. అవతల అబ్బాయికి ఆముద్ద ఎక్కడ దక్కిపోతుందో అని తనకి ఇష్టంలేకపోయినా బిడ్డ వెంటనే వచ్చి ఆముద్దను అందుకుని కబళించేస్తాడట ఇంత చక్కని ఉపమానాలతో మనకు భగవంతుని లీలలను బోధిస్తాడు.

మందు వాడవద్దనడు....ఎందుకూ? అట్లా అంటే అకర్మణ్యత ప్రాప్తిస్తుంది ....మన విధ్యుక్త ధర్మాలను మానిపించి కూర్చోపెట్టే మతంకాదు ఆయనది.... మనధర్మాలను పూర్తిగా, అణుమాత్రం లోపం లేకుండా జరపాలని, అట్లు నడుపుతూనే హృదయం భగవత్పరం చెయ్యాలనే అతని ఆశయం. అదే మన కందరకు శిరోధార్యమైన భగవద్గీత బోధించేది. శరీరంతోటే కష్టసుఖాలు పుట్టినా ఈశరీరం ఉన్నంతకాలం అవి కలగటం మానవు వాని విషయంలో మన విధ్యుక్తధర్మాలు జరుపుతూనే ఉండాలి. వానిని వదిలెయ్యకూడదు. హృదయాన్ని భగవద్దత్తం చెయ్యాలి — మన జీవితాన్ని నడుపుతూన్న జగత్ప్రభుని అద్భుతలీలల్ని తిలకించాలి. ఆ జీవితేశ్వరుని సన్నిధిలోనుండి ప్రపంచజీవుల జీవయాత్రలన్నీ చూచి ఆనందించాలి. ప్రభుని కరుణను చూచి అనుభవించాలి — ప్రతి జీవిమీద ఆ ప్రభుని ప్రేమామృతము ఎల్లాప్రవహిస్తుందో పరిశీలించాలి. మన మెట్లు ప్రభునకు ప్రేమాస్పదులమో అన్ని జీవరాసులుకూడ ప్రభునకు అంత ప్రేమాస్పదమైనవేనని గుర్తించాలి. అన్ని జీవరాసులలోను కలసిపోయి, మన ప్రత్యేకతను మరచిపోయి ప్రభుప్రేమలో నిమగ్నత పొందాలి. ఇన్ని ఆశయాలు ఇమిడి ఉన్నాయి ఆ ప్రభుని బోధల్లో.... ప్రభువుమనతో ఒక్కడై, మనలో ఏకత్వము పొందుతున్నాడు. అదే పద్ధతిలో మనం జీవరాసులతో ఏకత్వం పొందగలిగినప్పుడు అద్వైతసిద్ధి కలిగినట్లేకదా... ఒక్క పరిశుద్ధ ప్రేమయే ఉన్నది. ఆ ప్రేమయే పరమాత్మ.

ఒకచోట ప్రభువు "నాయనా నీకున్న అపారసంపత్తుతో రకరకాల విందులు చేసి సాటివాళ్ళను, బంధుగణాన్ని తృప్తి

పరిచావు.... కాస్త నీ మనసును అన్నార్తులపైకి, ఏదిక్కూ లేని దీనాతి దీనులపైకి త్రిప్పు. నీవు విందులు చేసినప్పుడు నీ బంధుగణం, నీసాటివాళ్ళు పొందిన సంతృప్తి, ఆనందం- ఈ అన్నార్తులకు నీవు సమకూర్చిన భోజనమునకు వారు పొందే తృప్తి- ఆనందం- వీనివ్యత్యాసమును పరిశీలించిచూడు" అని చక్కని ప్రబోధం చేశాడు.

దీనులు....దుఃఖితులు....ఆర్తులు....అనాధలు....అన్నార్తులు ....వస్త్రవిహీనులు, రోగులు.... బాధితులు.... వంచితులు.... ఈ పదాలలో ఒక్కొక్క దానిమీదనే ధ్యానముంచి, ఆ వ్యక్తులను మనసులోనికి తెచ్చుకుందాం.... ఒక్కసారి భావవీధిలో వారిమీద చేయువైచి, వారి వీపుమీద చేయి పెట్టి నిమురుదాం...,వారి హృదయాలలో వృత్తేదడను స్పృశించి తెలుసుకుందాం....వారి కళ్ళనుండి కారే వేడి కన్నీళ్ళను మన జేబురుమాలుతో తుడుద్దాం .... వారి ప్రక్కన కూర్చుండి "భయం లేదు నాయనా....చూడు...నీ విల్లా ఏడిస్తే యెట్లాగ? ఏడవకు.... ఇదిగో.... ఇది తిను.... ఇదిగో ఇవి తీసుకో.... ఇది కట్టుకో...." అని చెప్పుదాం....

ఒక్కమారు ప్రశాంతహృదయంతో ముందుగా భావవీధిలోనికి వచ్చిన దీనదుఃఖితులకు ఈవిధమైనసేవచేసి చూద్దాం. ఎంత అనిర్వచనీయమైన ఆనందం లభ్యమౌతుందో! మన భావవీధిలో కనబడే ఆ దీనాతిదీనుల ముఖాల్లోని దీనత్వం మన హృదయాలను ఎంత కరగించివేస్తుందో! కారణం ఎన్ని విధాలుగా ఉన్నప్పటికి, దీనత్వం ఒక్కటే. మన ప్రభువు ముఖమోరూపొందిన దీనత్వం. దైన్యం ఎక్కడ కనపడ్డా మన ప్రభువు,

ప్రభుని దీనముఖం, దీనభాషణం జ్ఞప్తికి రావలసిందే. ఏమో హతాశ... ఏమో నిస్పృహ... ఏమో అధైర్యం .... ఏమో చెప్ప శక్యంకాని ఆందోళనం.... ఏమోనిలబడటానికి సాహసం లేని బెదురు... ఏమో పెద్ద బెంగ... ఏమో ఎవ్వరికో తన అపరాధానికి సమాధానం చెప్పుకోవాలా అన్న అదటు .... ఈలాటి ముఖ లక్షణాలు కనపరుస్తూ పలికే పలుకులు ... "నాయనా నా అనారోగ్యానికి భయపడకు....ఇతరులకోసమే ప్రభువు నా శరీరాన్ని ప్రసాదించాడు. మీ సర్వభారాలూ నా మీద పడవేయటానికి శంకించవద్దు" ఈ విధంగా హెచ్చరిస్తాడు.......దీన దుఃఖితుల ముఖాల్లో ప్రభువు- ప్రభువు ముఖంలో దీనదుఃఖితులు......

మరొకవిషయం....ఒక్కమారు ప్రపంచంలోని మన పేరు ప్రతిష్టలు, పదవులు, ఔన్నత్యాలు ఒక్క ఐదునిమిషాలు దూరంగా ఉంచి ఏకాంత స్థలంలో మనను మనం చూచుకుందాం....మనం దీనులముకామా?....అయిదు సంవత్సరములలో మృత్యుగండమని ఏ జోస్యుడో చెప్పెననుకొందము....మనం మనకున్న ఐశ్వర్యముతో సహా నిస్సహాయ దీనాతి దీనస్థితికి రాతగ్గవారమేకదా! ఈ నాటకరంగంమీద ఏదృశ్యం ఎప్పుడు ఏవిధంగా మారుతుందో! తెరపడి మళ్ళా తెరలేవడానికి ఎంతో పెద్ద విలంబనం అవసరంలేదు. ఎటు చూచినా పచ్చని పచ్చిక బయళ్ళతో, సందీయని పచ్చని ఆకులతో, చక్కని పూవులతో, రసవంతమైన ఫలాలతో, పక్షులతో, తుమ్మెదలతో సరోవరాలతో నేత్రానందంగాకనబడే వనలక్ష్మి విహారవాటిక తెరమూసి తెరతీయగానే నిప్పులుచెరిగే గ్రీష్మాతపంతో బీటలు

వారిన నేలగా మారిపోతుంది...చెప్పలేం....ఏ దృశ్యం ఎట్లా మారుతుందో....కనుక కన్ను తెరచుకుని మనకు ప్రభువిచ్చిన దానిని బీదసాదలకు కూడా చెందనివ్వాలి. మనం ఆరగించే కూరలనూ, మనం తినే పిండివంటలనూ, నేతిమిఠాయిలనూ ఒక్కరవ్వ వాళ్ళకి కూడా రుచి చూపించినప్పుడు వాళ్ళుపొందే ఆనందాన్ని చూడమన్నాడు ప్రభువు...వాళ్ళ ఆనందానికి మేర ఉండదుకదా........

ఒక ఇంగ్లీషుకవి తన ఉపన్యాసంలో సొటికై స్త్రీలకు ఒక నగ్న సత్యాన్ని యిట్లాగు బయలుపెట్టాడు—"మీరు మీ క్రిస్మస్ పండుగకి చక్కగ అలంకరించుకుని, గుఱ్ఱపు బండ్ల లోనూ, గుఱ్ఱాలమీదా, కాలి నడకనీ పోతూ, మీమీ దర్జా లను కనబర్చుకుంటూ, విరగబడి నవ్వుతూ, మీ పిల్లలకి ముద్దుగా ప్రకృతి దృశ్యాలను చూపిస్తూంటే, దిక్కులేని దీనాతి దీనులు, భగభగ మండుకుపోతున్న ఆకలిచిచ్చును చల్లార్చు కునేటందుకు మీ కటాక్ష వీక్షణాలు తప్పితే వేరే దిక్కులేక, అందరకు మహాపవిత్రమైన ఆ పర్వదిన మునందు ప్రత్యేకంగా చింకిపాతలను కట్టుకుని మీకళ్ళబడ తారు. ఎందుకో తెలుసునా ? వారి చింకిగుడ్డలకీ, మీ బిస్తల చీని చినాంబరాలకీ కల అంతరం బాగా కనబడితే మీరు మీ ఔన్నత్యానికి పొంగి పైసలు విసిరేస్తే ఏరుకుందామని."

మన దేశంలో మాత్రం ? అక్కడక్కడ ఇల్లాజరగటం చూస్తూనే ఉంటాం.... నేను నాకళ్ళారాచూచాను. ఒకపెద్ద అధికారి తనకోటు క్రిందిజేబుల్లో పైసలుపోసుకొని తానుముందు దృష్టితో పోతూ పోతూ తన దృష్టినయినా త్రిప్పకుండా చేతికి

అందినన్ని పైసలు విసరివేసేస్తూపోవటం....అది దర్జాలక్షణం. పాపం ఆ బీదలు తిని పారవేసిన విస్తరిమీదికి కుక్కలు పడ్డట్టు పడి ఆ పైసల్ని ఏరుకోవడం....

నిజంగా బీదసాదలమీద దృష్టిపెట్టి, వాళ్ళకష్టాల్ని కని పెట్టి వాళ్ళకు సుఖంకలిగించాలని అనుకున్న వాళ్ళకి ఈ దర్జాలూ ఈ లక్షణాలూ యెందుకుంటాయి? ప్రభువు జన్మోత్సవాల్లో జరిగే బీదనారాయణ సేవకు పిండివంటలతో సహా వడ్డనలుజరిగేవి. ప్రభువు నడుముబిగించిపనిచేస్తూఅందరూ తృప్తిగాతినడం కళ్ళారాచూచి ఆనందించేవాడు.

ఇక మన తీరిక సమయాలూ మనస్నేహితులూ, కన్ను విప్పి దూరదృష్టితో చూస్తే సమయం ఎంత అమూల్యమైందో తెలుస్తుంది. అటువంటి సమయాన్ని వ్యర్థసంభాషణల్లో ఎంత పాడుచేసుకుంటున్నామో ఆలోచించండి. మన యొద్దకువచ్చే మిత్రులనిపించుకొనే వ్యక్తులు మనకు తాత్కాలికానందం కలుగచెయ్యటానికి ఏ గొడవలు తీసుకువస్తారో ఎంతమందిని విమర్శిస్తామో వాళ్ళతో కలిసి. నిజం ఆలోచించి చూడండి మనవిమర్శనలలో పడ్డవాళ్ళ ఆంతర్యం ఎటువంటిదో మన కేమైనా తెలుసునా? విన్నమాటలునమ్మి ఎన్నెన్ని మాట లంటామో! ఎందుకు మనం యీఅనవసరప్రసంగాల్లో పడాలి? కొన్ని విపరీత పరిస్థితులలో ఈ ప్రసంగాలు ఎన్నిప్రమాదాలు తీసుకువస్తాయో కూడా కళ్ళారాచూస్తూ యీ అభ్యాసాన్ని మానలేం.

ఒక లక్ష్యం మనస్సులో పాతుకుపోతే అన్నీ బాగానే ఉంటాయి! ఆ యేక లక్ష్యం లేకపోవడంవలన జీవి అనేక పరిణా

మాల పాలవడం సంభవిస్తుంది. వీధిలో పడియున్న యెండుటాకు ఏదిక్కుకు పోతుందో ఎవడు చెప్పకలడు? ఏగాలికి ఎటు ఎగిరిపోతుందో....ఏ కాలికి అంటుకుని ఎక్కడ రాలిపోతుందో. ఏశక్తి బలమైతే అటుపోతుంది....చివరకు నలిగి నలిగి చిన్న తునకలై మట్టిలో కలిసిపోతుంది. ఏ లక్ష్యం లేని జీవితాలు అటువంటివి. ఆగాలులలోపడి కొట్టుకుపోయి ఎందరి యిండ్లలోకో, ఎన్ని కుటుంబకలహాల్లోకో ఎగిరిపోయి ఎప్పటికో కళ్ళు తెరుస్తాయి. తీరా వెనక్కి చూస్తే బయలుదేరినస్థలానికి కోసులకొలది దూరంగా ఉన్నట్లు కన బడతాం....కాని అప్పుడు విచారించి ఏం లాభం.

మనమాటకుఎదురుచెప్పే వ్యక్తి లేనిచోట, ఎందుకో మననోటికి జడిసి మారుమాట రానిచోట, మనం చెప్పే న్యాయాలు మనం బోధించేధర్మాలు, మన్ని మనం కనబర చుకోకుండా చెప్పేనీతులు, ఒక్కసారి సింహావలోకనం చేసుకుని చూస్తే, ఈ ఉపన్యాసాలు యివ్వటానికి నేను యోగ్యుడనేనా? అని పరిశీలిస్తే, నేను చేసేదంతా నటనకదా! అని తప్పకుండా తోస్తుంది. లోకాభిరామాయణాలు, లోకసంబంధ వ్యక్తులతో గోష్టులు, మన యధార్థస్థితులను మరపించి సత్యానికి దూరం చేస్తూ, మనకు మనల్ని చాలా భారంచేస్తూ అధోగతికి తీసుకు పోయే బలవత్తరమైన గొలుసులు, ప్రభుసంబంధమైన సందే శాలూ ప్రభుని అద్భుతలీలలూ, ప్రభుభక్తుల జీవితకథలూ, దృష్టిని మనమీదకు త్రిప్పి మనలను తేలికపరచి, సత్యమునకు అభిముఖులను గావించి, ఊర్ధ్వగతికి తీసికొనిపోయే ప్రేమ పాశాలు........

ఒక్కసారి నిత్యం మనలను కలుసుకుని మాట్లాడే వ్యక్తుల్ని వారు ప్రతిదినం మన ముందర ప్రవేశపెట్టే విషయాలనీ పరిశీలించుకుందాం. ఈ వ్యక్తులు ఎప్పుడు కలసినా ఈసంభాషణలనే పెంచుతారు. ఈ వ్యక్తులవలన యిదివరలో యీ విధంగా నేను అనుభవించాను. కనుక ఈ వ్యక్తులపట్ల నేను జాగ్రత్త వహించాలి. అని విమర్శించుకుని మన ఆధ్యాత్మిక మార్గానికి తోడు పడేవారు లోకరీత్యా ఎంత తక్కువవారైనా వారిని హృదయం యిచ్చి ఆదరించి దగ్గరకు తీసుకుంటూ మన ఆధ్యాత్మిక ప్రయాణానికి అడ్డుతగిలి ప్రపంచంలోని కీడ్చే వ్యక్తులు ఎంత వాజ్మాధుర్యంకలవారైనా, లోకరీత్యా ఎంత గొప్పవారైనా వారిని వీలైనంతవరకు తగ్గించుకుంటానికి తగిన ఉపాయాలుచేస్తూ,చాలాకొద్దిమాటలతో ముగిస్తూ వారుపోగానే ఆకొద్దిసేపటిలో మనసుకు అంటుకున్న మలినాన్ని ప్రభునామ స్మరణతో కడిగివేసు కుంటూంటే క్రమక్రమంగా మనలక్ష్యానికి దగ్గర పడుతూంటాం.

ప్రభువు తన అసంఖ్యాక లేఖలద్వారా ప్రభునామ స్మరణమూ, దాని మహాత్మ్యమూ మనస్సులకు పట్టునట్లు ప్రకటించినాడు. నామ స్మరణమునకు ప్రతిమానవుడూ అలవాటు పడవలె. ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె ప్రభునామము తనయంత తానే జరుగునట్లు అలవరచుకొనవలె. ఇది లోకసమ్మతమైనది.

ప్రభుహరనాధుణ్ణీ వాని లీలల్నీ చూడాలనే కోరికతో పరిశీలిస్తే దినదినం ఏదో విధంగా మనకు కనపరుస్తూనే ఉంటాడు—తన ఉనికిని చూపిస్తూనే ఉంటాడు. తన భక్త పరివారంలో ఏ ఒకనితోడనో పరిచయం కలిగిస్తూ ఉంటాడు. కాని

మన ఐహిక విషయాల్లో వానిగుర్తు తెలిసికోము. వాని సాంకేతికాలను గ్రహింపలేము.

## నడవడి – సాంగత్యం

ఇక నడవడిని గురించి ప్రభువు ఘోషించే ఘోషని కూడా మనం కనిపెట్టాలి. నడవడినిగూర్చి అతడిచ్చిన అమూల్యోపదేశాల్లో ఏ ఒక్కదానిని పూర్తిగా పాటించినా మన జన్మ సార్థకమే. సాంగత్యం, ఐకమత్యం ఈ రెండూ చాలా ప్రాముఖ్యమైనవి. సాంగత్యం వలన గుణ దోషాలు పెరుగుతూ ఉంటాయి అనేది నిర్వివాదాంశం

మన ఆశయాలకి తగిన సాంగత్యం వెతికి వెతికి అట్టి వారితో పరిచయస్నేహాలు అలవరచుకోవటం చాలా ముఖ్యం. మనం తరచుగా కలుసుకుంటూ ఉండే వ్యక్తుల్ని పరిశీలించుకోవాలి. వారిలో ఎవరు ఏ ప్రస్తావనలు తెస్తూ ఉంటారో....ఎవరితో సంభాషణం నిజమైన మనశ్శాంతిని ప్రసాదిస్తూ ఉన్నదో .. ఏ సంభాషణానంతరం మన హృదయభారం తగ్గి, హృదయం తేలికపడి ప్రభునివైపు ఉరకిమరలుతుతూ ఉన్నట్టు తోస్తుందో అవన్నీ ఉన్నత పదవికి దోహదంగా ఉంటాయి. అటువంటివే మనం చదివే పుస్తకాలూ – చూచే సినీమాచిత్రాలూ, అయితే ఎంతో మంచిది.

పుస్తక పఠనంలో కూడా చాలా జాగ్రత్త తీసుకోవాలని ప్రభువు సలహా. ఒకనవలనుకాని నాటకాన్నికాని తీసి చదువుతూన్నామంటే దానిలో వచ్చే వ్యక్తు లందరితోనూ మనం సాంగత్యం చేస్తూన్నట్లే. సాధారణంగా ప్రేయసీ ప్రియుల ప్రేమ

కలాపాలూ, మోహజనకంగా ఉండే వాళ్ళ మనోభావాలూ, వియోగ దుఃఖాలూ, సంయోగ సుఖాలూ లేని నవల కనబడదు. ప్రొద్దు పుచ్చటానికి వీటినే ఉపయోగిస్తూ, అలవాటు చేసుకున్న సోదరులూ, తల్లులూ అసంఖ్యాకంగా కనబడుతూంటారు. ప్రతి పుస్తకం పఠనానంతరం తన ప్రభావాన్ని కాస్తో కూస్తో చదువరి మనస్సుమీద చూపకుండా ఉండదు. ఇక పూర్వకవులు వ్రాసిన ప్రబంధాలను చదువ మరిగిన యువతీ యువకులను గురించీ - అదే విధంగా చదువగా చదువగా వారి చిత్తవృత్తులు ఏ పద్ధతిలో పోతూంటాయో వేరే చెప్పటం అనవసరం.

ఇక సినీమా చిత్రాల ప్రభావం ఎటువంటిదో మనం కళ్లారా చూస్తూనే ఉన్నాం కనుక ఈ విషయాల్లో ఎంత జాగ్రత్త వహించాలో ఒకరు చెప్పవలసిందేం ఉంది? ఎప్పుడూ సంకల్ప వికల్పాలతో కొద్దిగా చలిస్తూ ఉండే ఈ మనస్సాగరాల్లో ఈ నవలలూ-ఈ ప్రబంధాలూ- ఈ సినీమా చిత్రాలూ ఎటువంటితుఫానులు పుట్టించి అల్లకల్లోలం చేస్తాయో చూడండి.

వృత్తి సంబంధంగా ఉండే మన పరిచయాలు వేరు. అవి పొట్టకూటికి సంబంధించినవి. వాని విషయంలో సత్సాంగత్య నియమం పెట్టుకోవడం చాలా దుస్తరం. కాని పనిలేని తీరిక సమయాల్లోనైనా మనం దుస్సాంగత్యాలలోనూ - పనికిరాని సంభాషణలలోనూ కాలం వృథా పుచ్చటం ఆధ్యాత్మిక పురోభివృద్ధికి హానికరం.

తీరిక సమయాల్లోని మన విహారాల్లో నిలిచే ప్రదేశాలూ, గృహాలూ, శ్రద్ధగా విన్న మాటలూ చదివే పుస్త

కాలూ — ఇవి కొంచెం నియమబద్ధంగా ఉంచుకో కలిగితే అచిరకాలంలో అద్వితీయానందం పొందటంలోనూ మాయా వరణంనుండి బయటపడటం లోనూ అనుకూలత్వం సిద్ధిస్తుంది.

ప్రభువు ఇచ్చిన ఈ ఉపదేశాన్ని అమలులో పెట్టుకో వటం పెద్ద కష్టసాధ్యంకాదు. — అసంభవం కాదు. కొంచెం కష్టపడి ఒక మాసం ప్రయత్నం చేస్తే మనస్సు ఆదారినే పడు తుంది. లోకసంబంధమైన వ్యక్తుల సంబంధం క్రమ క్రమంగా తగ్గిపోతుంది. అనవసర సంభాషణానికి చోటివ్వకపోతే ఆ ప్రస్తా వన తెచ్చేవారు కూడా క్రమ క్రమంగా జారుకుంటారు. ప్రభు భక్తి పరులకి గృహంలో కొంచెం చోటిచ్చి, రవ్వంత ఆప్యా యత చూపకలిగితే గృహంలో ఉన్న వ్యక్తులందరికీ భక్తి అబ్బే అవకాశం ఏర్పడుతుంది.

## • ఐకమత్యం

ఇది తాత్మికి సంబంధించింది. ప్రభుని అవ్యాజ కరుణా విశేషంచేత ప్రభుని భజించే ప్రతి వ్యక్తి ఆప్తబంధువే అనే ఒక చక్కనిభావం కలుగుతూనే ఉంది. ప్రభుని పేరుతో ఉన్న కొట్టుకాని, గృహంకాని కనబడితే 'ఇది నా ప్రభుని నివాసం కదా' అని ప్రాణం లేచివస్తుంది. ప్రభుని చిత్రంకల 'లాకెట్టు' ధరించిన వ్యక్తి అపరిచితుడైనప్పటికీ ఆత్మబంధువులాగే కన బడతాడు. ఇక్కి ప్రేమ సంబంధాన్ని ప్రభువు తన అదృశ్య రూపంతో సమకూడుస్తున్నా, ప్రభు భక్తులలో ఐకమత్యం తక్కువై పోవటం చాలా శోచనీయం.

శ్రీహరనాథ కుటుంబానికి శ్రీహరనాథుడే నాయకుడు. ఒకవృక్షానికి పెక్కుశాఖ లున్నట్లుగా శ్రీహరనాథభక్తి వృక్షా

నికి పెక్కుశాఖ లున్నాయి. అవీ లోకోపకార సంబంధమైనవే. శ్రీహరనాథుని ఆశయాలని పూర్తి చేయటానికి ఈ శాఖలలో ఏదో ఒకదానిని పట్టుకుని ప్రతివ్యక్తీ కర్మక్షేత్రంలో దూకుతూ ఉంటాడు. వీని కంతకీ మూలం మన ప్రభుని పేరిట ఏదో చెయ్యాలి. అనే ఉత్సాహామే.

అందు వలన అందరం ఏకకుటుంబ వ్యక్తులం అనీ, అంద రం భిన్న భిన్న ఉద్యమాలలో ఉన్నాం - ఆ వృక్షానికే సేవ చేస్తూన్నామనీ, భావించుకుని సోదర భావంతో ఈ మహా వృక్షం తన వ్రేళ్లతో భూమినంతనీ, శాఖలతో ఆకాశాన్నం తనీ ఆక్రమించుకునేటట్లూ, ఈ వృక్షచ్ఛాయకై ప్రవేశించే సర్వజీవకోటికీ రక్షణ చేకూరేటట్లూ పాటుపడుతూ, శ్రీహర నాథ విరాట్స్వరూపం ఆచంద్రతారకంగా నిలబడటమే ఏకైక లక్ష్యంగా ఉండాలి ప్రతి శ్రీహరనాథభక్తునికీ.

ఒహో! ప్రభుకరుణ! ప్రతివ్యక్తి జీవితంలోనూ ఒక చక్కనిరసం పుట్టించటానికి ప్రభువు యెంత ప్రయాసపడి తన లేఖలద్వారా ప్రోత్సహిస్తాడో చెప్ప శక్యంకాదుకదా!

జీవితంలో కలిగే కష్టసుఖాలలో నలిగిపోతూ, ప్రోత్సా హం లేక నమలినపిప్పినే నములుతూ, పడుతూన్న బాధలు చెప్పుకునేటందుకు తగిన సానుభూతిపరుడు దొరకక, హృదయా నికి చల్లనినీడ దొరకక, నిప్పులకుంపటిలో వేగిపోతూండే జీవు లకు శ్రీ హరనాథ ప్రభువువంటి చక్కని చెలికాడు...చక్కని పితృదేవుడు.... దొరకటం బద్ధజీవులు యేనాడో చేసికొనిన పుణ్యాఫలం. ఆయన లేఖలను పఠించటం హృదయానికి పంచ భక్ష్యపరమాన్నాలతో లభించిన భోజనం.ముఖ్యంగా, మనస్సు

కలకబారినప్పుడు యీ లేఖలు యిచ్చే మనశ్శాంతి... ఒకవిధమైన ఉత్సాహం చెప్పనలవికానిది. ఇవి ఉపదేశపూర్వకంగా ముఖాముఖిని చేసిన బోధలయితే మనకు దొరికేవి కావేమో! ఆ ప్రభువు దూరాననుండి ఆ భక్తజనానికి లిఖితపూర్వకంగా యిచ్చినవవటంచేత ఆసౌరభం అల్లా నిలిచిపోయింది. ఇవిమైనా ఆయన అసంఖ్యాకజనానికి వ్రాసినవానిలో కొన్ని మాత్రమే ప్రకటింపబడ్డాయి. అక్కడికైనా మనం యెంతో భాగ్యవంతులమని సంతోషించాలి.

ప్రభుని లేఖల యెడల యేమాత్రమూ అశ్రద్ధచూపకూడదు. అవి ఆకలిగొన్నప్పుడు అన్నంపెట్టే అక్షయపాత్రలు. చాలాభద్రంగా కాపాడుకొని యేకాంతంగా మనస్సు వానిమీాద ఉంచుకొని పఠించాలి. అందుచేత యీ ధనాన్ని ప్రాపంచికధనంకంటె యెక్కువగా చూచుకుని ప్రభు ప్రసాదంగా దాచుకోవాలి. ప్రభువు శరీరం వదలినప్పటికీ లేఖలరూపంతో చక్కని పలుకులు పలుకుతూ మనయింఢ్లను తన నివాసం చేసుకొని తల్లిని యెడబాయలేని బిడ్డలాగు తిరుగుతున్నాడు.... చదవండి........మనయింఢ్లకు మనకొరకు వచ్చినవారిచేత చదివించండి....... వినిపించండి....మనం వారికియిచ్చే ఆతిథ్యంలో యిదికూడా ఒకసేవగా యెంచుకోండి.... అవసరం అనిపిస్తే "ఈవిషయం నాకు బోధపడలేదు. కొంచెంవిడమర్చి చెప్పనాయనా" అని వచ్చినవారి తీరికననుసరించి యేమీా తెలియనట్లు కూర్చుని తెలుసుకోండి.అదిఉభయతారకం,మంచి కంఠస్వరంతో మనకుఆనందం చేకూరుస్తాయని చిలుకలని తెచ్చి పంజరాలలో ఉంచి వానికి మంచి మంచి ఫలాలను పెట్టి

పోషిస్తాం. కాని పంజరంతలుపు యేమాత్రంసందిచ్చినా ఆచిలు కలు కించిత్తు విశ్వాసంకూడా చూపకుండా పారిపోతాయి. కాని శ్రీ హరనాథ శుకం కోరి మనపంజరాలలో ప్రవేశించింది పంజర ద్వారం తెరచి ఉన్నా.... కావాలని తోసివేసినాపోనిది. అయాచితంగా, అనాయాసంగా లభించిన ఆనందదాత.

ఈ ప్రభునిగూర్చి యేమిటనీ, ఈ యన భగవంతుడా? అనీ అవతారమూర్తి యెలా అవుతాడు? అనీ, రామకృష్ణా దులుండగా యీాయన నెందుకు పూజించాలి? అనీ, అడిగి, తర్కవితర్కాలు పెంచే వ్యక్తులకు యేమీాబదులు చెప్పకుండా నాయనా నీకు తెలుసుకోవాలని తీవ్రమయిన కోరికే ఉంటే యీా లేఖలను జాగ్రతగా చదివి వీనినిబట్టి శ్రీహరనాథమూర్తి యెవ్వరో, అట్టివారియెడల మనం పెట్టుకొనవలసిన భావం యేమిటో అచరించవలసిన దేమిటో, ఆయనకు మనం యేస్థా నం యివ్వాలో నీవేనిర్ణయించు కొమ్మని చెప్పండి. అదే చక్కని ఉపాయం. అనవసర వాగ్వాదాలలో దిగకండి, భావం లోని విషయం.... ముఖ్యంగా హృదయంలో పదిలపడి పాతు కొనిపోయిన విషయాన్ని వాగూపకంగా వ్యక్తంచేయటమూ అందులో యెదుటివారిని ఒప్పించటమూ అసంభవమైనపని. అందుకు ప్రయత్నం చేయటంవలన చెప్పేవారికీ వినేవారికీ కూడ సుఖంఉండదు. ఒకప్పుడు దుఃఖకారణంకూడా అవుతుంది అతి సుకుమారమయిన యీా కుసుమహార కుసుమాన్ని నలిపి పాడుచేసుకోవటమూ, అదియిచ్చే హృదయానందకర సౌరభాన్ని దుర్వాసనగా మార్చుకోవటమూ, జరుగుతుంది.

శ్రీ హరనాథమూర్తి వంటి సేద్యగాడు మరొకడు కన బడడు. ఎటువంటి చవిటినేలనైనా చక్కగా పదనుపరచి సస్య శ్యామలం చేయగలిగిన సిద్ధహస్తుడు. ఎడారిప్రదేశంలో అమృతవృష్టి కురిపిస్తాడు. మంచి బీజాలని చల్లి యెప్పటికప్పుడు దోహదంచేస్తూ యీఋతు వాఋతు వనకుండా యెల్లకాలం పుష్పించి ఫలించే ఓషధులను తయారుచేసే నేర్పు ఆయనలోనే ఉంది. ఆ విషయంలో ఆయన నిర్ణిద్రుడు. మూర్తీభవించిన జీవశక్తి. జడ పదార్థాలకుగూడా చైతన్యం ప్రసాదింపగలిగిన రూపొందిన చైతన్యం

ఒకప్పుడు శ్రీ హరనాథుడు తన భక్తపరివారంలో కూర్చుని ముచ్చటిస్తూ తాను కూర్చుండుటకు పరచిన చాప కున్న చిన్నపీచును త్రెంపినాడట. అది సాధారణంగా మనం యేదో ఆలోచిస్తూ చేసేపని. కాని ప్రభునిపైననే దృష్టిని మనస్సును పెట్టుకొని కూర్చున్న భక్తులు ప్రభువు చేస్తూన్న ఆపనిని కూడా తదేకనిష్ఠతో చూస్తూన్నారట. ప్రభువప్పుడు ఆ కొసముక్కను భూమిమీదవదలి దానివంకనే దృష్టినుంచి దానికి "టీ" యివ్వమన్నాడట. అక్కడ ఉన్న ఒక భక్తుడు ఒక చెంచా "టీ" దానిమీద పోసినాడట. వెంటనే ఆ కొసముక్క ప్రాణదానంపొంది, ఒక విచిత్రమైన పురుగై జర జర ప్రాకుతూ పోయిందట.

నిజంగా యీ సృష్టిలో జడపదార్థం లేనే లేదు. ప్రభుని వాక్కు నిర్వివాదం. కృష్ణబృందావనంలో జడపదార్థం లేదట. ఆ వేణుగాన ప్రభావం వలన ప్రతిపదార్థమూ సచేతనమేనట. శ్రీహరనాథ మలయమారుత స్పర్శచేత, శ్రీహరనాథ అమృత

ధారచేత, శ్రీహరనాథ కృషీవల కృషిచేత, మోడులుచిగురిస్తాయి పాషాణాలు కరుగుతాయి. ఆ లేఖినీ మురళి తన జీవగానంతో యీ చోటు ఆ చోటు అనకుండా దశదిశలా వ్యాపిస్తోంది. అది యోగ్యతా యోగ్యతలెన్నకుండా అందరకూ లభ్యం అవుతూంది. ప్రతిజీవికీ కర్తవ్యాన్ని సూచిస్తోంది. అన్ని హృదయాలలోనూ మ్రోగి ప్రతిధ్వనులు తెప్పించటానికి అమోఘప్రయత్నం చేస్తోంది ప్రతీ హృదయంనుండీ అంతచక్కని ధ్వనులువచ్చే వరకూ అది నిద్రపోదు.

ప్రభువు కాశ్మీరం పోయినప్పుడు తొలిసారి కాశ్మీరారణ్యంలోనికి ఒంటరిగా వెళ్ళాడట. ఆపరిశుద్ధ ప్రేమమూర్తి కాలు యిలికిడికి అక్కడ ఉన్న జీవజంతువులు కొంచెము దూరానికి పోయి చెట్లచాటునుండి తొంగి తొంగి చూస్తూన్నాయిట. కొద్ది క్షణాలలో ప్రభువును గుర్తించి సుపరిచిత వ్యక్తిని సందర్శించినట్లు మహదానందంతో ప్రభుసన్నిధికి వచ్చాయట. పాదసన్నిధికి వచ్చి ఆ దివ్యచరణాలను ముద్దుపెట్టుకుని ఆనందబాష్పాలు రాల్చాయిట. వనవిహంగాలు ప్రభుశిరస్సుపై, భుజస్కంధాలపై వ్రాలి కిలకిలారావాలతో ప్రభునకు స్వాగతం యిచ్చాయిట. చెట్లకొమ్మలు ప్రభుని ఆలింగనం చేసుకున్నాయిట. సరీసృపాలు ప్రభు పాదాలకు మెలివేసుకు పోయాయిట. ఆవన్యజీవుల ప్రేమలో ప్రభువు, ప్రభుప్రేమలో వన్యమృగాలూ మైమరచిపోయి కాలజ్ఞానం కోలుపోయాయి.

ప్రభు ప్రేమను బుద్ధిలో ఉంచుకొని, ఆ నిష్కల్మషత్వాన్ని గమనించి, ఒక్కసారి యీ సృష్టివంక చూడండి... జీవరాసులను పరిశీలించండి. సర్వంకూడా ప్రేమ

భరితమైన పరిశుద్ధ ప్రేమదాహంతో మన సానుభూతికోసం నిరీక్షిస్తూన్నట్లు కనబడుతుంది. ప్రభువే దీనాతిదీనంగా సర్వమయుడై ప్రతిపదార్థమునందూ ప్రవేశించి, మనహృదయ కవాటం యెప్పుడు తెరువబడుతుందా, మానవహృదయాన్నుండి పరిశుద్ధ ప్రేమస్రవంతులు యెప్పుడు బయలుదేరి ప్రవహిస్తాయా అని కనిపెట్టుకుని చూస్తూన్నట్లు కనబడుతుంది.

ఓహో నా ప్రభుని ప్రేమ దాహాన్ని కొంచెమైనా తీర్చ లేని నా బ్రతుకెందుకు.... కాల్పనా ? దీనాతి దీనుడై, కన్నీటితో దొప్పదోగుతూన్న నేత్రాలతో 'బాబా, నాకు ప్రేమ భిక్ష పెట్టవా'అని యాచిగిలబడి ప్రార్థిస్తూన్న మన ప్రభునికి మన హృదయాధిపత్యం యిచ్చి, 'నాయనా, బాబా, హరగోపాలా, యీ దినముననే.... యీక్షణమే నీకు దత్తమవుతూన్నాను.... నీగీచినగీట్లలో నడుస్తాను.... సర్వజీవులనూ ద్వేషభావం లేకుండా చూడటానికిప్రయత్నించేస్తాను...అహంకారాన్ని క్రమ క్రమంగా తగ్గించుకుంటూ, దానిని నిర్మూలం చేసుకుంటాను.... క్షమాభావాన్ని అభివృద్ధి పరచుకుంటాను... నిన్నెదురుగా పెట్టుకుని, నీముఖం చూచుకుంటూ, నీ యాజ్ఞగా భావించు కుంటూ, యితరులతో సంభాషిస్తాను.... ఫలితాన్ని నీకు సమర్పించుకుంటాను' అని, జీవితం ప్రభుమయం చేసికొనినప్పుడు కదా,ప్రభునిముఖం విప్పారేది....ఆవేదనం చల్లారేది. ప్రపంచం మెచ్చింది మెప్పుకాదు. లోకంయిచ్చిన ప్రమాణపత్రం ప్రమాణ పత్రంకాదు. ప్రభుముఖం వికసింపచేసినప్పుడు వచ్చినదే ప్రమాణపత్రం. అది ప్రభువిచ్చేది మాత్రమేకాదు.... సచరాచరంగా ప్రకృతిమాత తన విరాడ్రూపంతో దగ్గరకు తీసికొని,

అంకతలానచేర్చుకొని, తన స్తన్యాన్నియిస్తూ, తన సుకుమార కరాంగుళులతో ముంగురులుదువ్వుతూ, బుగ్గలునొక్కుతూ యిచ్చే ప్రమాణపత్రం.

ప్రభూ! స్మరణమాత్రాన్నే కన్నులు నీరుగ్రమ్మి, ఒడలు పులకితమై, మైమరపు గొలుపుతూ ఉండే ఆ శుభదినం యీజీవితంలో నాకులభిస్తుందా? శాశ్వతంగా కన్నుమూసేలోపల ఆ సుఖానుభూతిపొంది, హాయిగా ఆనందంగా, నీలోవిలీనమైపోతానా? ప్రభూ! ఆ శుభదినం.... ఆ శుభముహూర్తం కోసం హృదయం తత్తరపడుతోంది నీ చల్లనిచేతులను యీ హృదయ ప్రదేశానికి ఆనించి నాకు శాంతిదానంచెయ్యి ప్రభూ!

మానవ జీవితోద్ధరణం కొరకు ప్రభువుచేసిన తపస్సు-కాదు-చేస్తూన్న తపస్సు.... నిర్ణిమిత్తంగా తనపైన వేసికొనిన ఆ బాధ్యత యేమనిచెప్పాలి? ఆ కార్యభారానికి తన ప్రాకృతిక జీవితాన్ని బలిచ్చాడు. రక్తమాంస భరితమైన పాంచభౌతిక శరీరాన్ని బలిచ్చాడు ఒక్కసారి పరమపూజ్యులైన శ్రీనారాయణ చంద్రఘోషు సోదరునకూ శ్రీరామాప్రసాదఘోషు సోదరునకూ ప్రభువు తన నిర్యాణదినం యిచ్చిన దర్శనం... అతడు పలికిన పలుకులూ తలచుకుంటే హృదయం ద్రబద్దలై పోతుంది, మంటలోబడి మాడిపొయ్యిగా అయిన శరీరాంగాలతో దర్శనమిచ్చి 'చూడుబాబా! నన్ను వాళ్ళేంచేశారో' అని శ్రీనారాయణ చంద్రఘోషుకూ అక్కడ కనబడి తన దీన హీనస్థితిని కనపరుస్తూ శ్రీరామాప్రసాదఘోషును ఓదారుస్తూ తన ప్రేమఫలాన్ని కనపరచాడు. క్రూరమృగాలు సయితం

ముద్దుపెట్టుకుని, ఆలింగనం చేసుకుని, నిరుపమాన- అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందగోన్న ప్రభుశరీరానికి మానవులిచ్చిన ప్రేమపురస్కారం తెలుస్తుంది.

ప్రభు భక్తకోటి అంతా.... నేను హరనాథ సేవాపరాయణుడననీ.... భక్తిప్రచారకుడననీ.... చెప్పుకునేవారంతా ప్రభుని ఆశయాలను ఆచరణ పూర్వకంగా కొలదిగానో, గొప్పగానో నడవడిలో ప్రవేశపెట్టుకొన్నప్పుడు యీ ప్రపంచం చక్కని బృందావనంగా మారవలసిందే అప్పుడు మన ప్రభువు తాను స్వయంగా బీజాలునాటి, మొక్కలుచేసి, పెంచిన యీ బృందావనంలో- తానునిజంగా కుసుమహారుడై నృత్యం చేస్తూ ఒడలు మరచి పోతాడనటం నిస్సంశయం. అంతవరకూ మన ప్రభునకు శాంతిలేదు. అప్రాకృతశరీరంతో తిరుగుతూ ఉన్న ఆ దైన్యభావం అలాగు అల్లాడుతూ తిరుగుతూనే ఉంటుంది.

మనలో కొద్దిగా భక్తిభావం ఉదయించిందంటేనే ప్రభునకు మహానందం! మనవలన యీ భగవత్ప్రేమ యితరులకు అంటిందంటే ప్రభువు ఉప్పొంగిపోతాడు. ఆ హం భా వం పూర్తిగా నశింపజేసుకుని మన అల్పత్వమూ భగవానుని అధికత్వమూ గుర్తుంచుకున్నప్పుడు భగవత్ప్రేమ యెక్కువగా వస్తుంది. అహంకార వాసన యేమాత్రం రాకూడదు. దృఢ విశ్వాసంతో భగవన్నామం స్మరిస్తూ భగవానుని అన్వేషించాలి పరమేశ్వరకృప మనపై కలగటానికి తార్కాణంగా మనఐహిక లాభాలను చూచుకోకూడదు. ఐహికభోగాలు పెరగటం మనలను ఇహలోక బంధనాలతో బిగతీయటానికే. ఒక్కొక్కభోగ

వస్తువు ఒక్కొక్క పాశం! ఏ భోగసామగ్రివలన సత్యసుఖాన్ని పొందలేక అల్లాడిపోయి ప్రభుసన్నిధిని చేరుకొన్నమో మరచి ఆ శాశ్వతానందదాత యొద్ద ఆ భోగసామగ్రినే యాచిస్తున్నట్లు లెక్క. మనం ప్రయత్నంచేసి తెంచుకోలేని బంధనాల నుండి ప్రభువు మనకు స్వేచ్ఛనిస్తూండగా మనం ఆ మహోపకారాన్ని తెలుసుకోలేక మనయొద్దనున్న దేదో పోయినట్లు బాధపడతాం.

భక్తిపథం చాలాజారుడునేల. కాని చాలాదగ్గరత్రోవ. కాలుజారు తూన్నట్లుకూడా తెలియని జారుడుదారి ప్రభునామం దొరికింది- ప్రభువు దొరికాడు అని మొట్టమొదట సాధారణంగా పుట్టే ఉత్సాహంతో చాలా ఆడంబరంగా బయలుదేరుతాం. కాని ఆ ప్రేమ యెటువంటిదో, ఆ మహాత్ముని యెడలా సోదర మానవులయెడలా యెట్లుప్రవర్తించాలో యెరుగక తిరుగుతాం. కాని పోగా పోగా రకరకాలైన సమస్యలని యెదుర్కోవటం జరుగుతుంది. మననిచూచి హేళనచేసే వాళ్ళూ, భక్తిముసుగులో వ్యవహరించే స్వార్థప్రియులూ తగులుతారు. అప్పుడు మనంయెట్లు మారిపోతామో మనకే తెలియదు మనంకూడా వారివలె మారిపోవటమో, లేక అంతా అటువంటివారేనని వెనక్కి తిరిగిరావటమో జరుగుతుంది. అందుకోసం ప్రభువు 'నాయనా, ఆడంబరం పనికిరాదుసుమా, భగవన్నామధనాన్ని చాలారహస్యంగా పోగు చే సు కు ని, రహస్యంగా దాచుకోవాలి. సాంగత్యంలోకూడా యెన్నికైన సాంగత్యం చెయ్యాలి. పఠించే పుస్తకాలుకూడా నీ దారికి అనుకూలం అయిన పుస్తకాలే చదవాలి. ముఖ్యంగా స్త్రీలతో

వ్యవహారించేటప్పుడు, మాతృభావం, పూజ్యభావం అలవరచు కోవాలి' అని చెప్పుతాడు. తన లేఖలలో అప్పటికిఉన్న భక్తి సంపన్నుల పేర్లనూ వారుండు తావులనూ తెల్పి 'వారిని కలుసుకో వారి సాంగత్యంవలన చక్కని భగవత్ప్రేమ నీకు అంటుతుంది;' అని వ్రాసేవాడు.

ఎంతవరకూ ప్రభు లేఖలలో మనం ఒకరితో ఒకరు కలిసిమెలసి ఉండటమూ సమిష్టిగా భగద్భక్తిని అభివృద్ధి పరచుకోవటమూ, బీదసాదలయెడల జాలిచూపటమూ, స్వధర్మాన్ని వదలకుండా నిరాడంబరంగా జీవించటమూ, సుఖాలకు బానిసలంకాకుండా త్యాగమయ జీవితాన్ని జీవించటమూ, కనబడతాయి. ఇదే ఆ యనకి ఆనందం.

ఒక ప్రాంతంలోనే ఒక్కనికో జాబు వ్రాస్తూ ఆ ప్రాంతానికి చెందిన అందరినీ గుర్తుచేసి వారి విషయంకూడా వ్రాస్తాడు. ఈ విధంగా ఒకవ్యక్తిని పదిమందితో కలపటం జరిగేది. సరిగా అదేవిధానం ఆ అపూర్వప్రభువు శరీరం చాలించినప్పటికీ, తన దివ్యశరీరంతో ఆకృషి జరుపుతూనే ఉన్నాడు. ఈ పథంలో ఉన్నవారికి ఏమీ లోకసంబంధం లేని నూతన వ్యక్తులతో ఏలాగు పరిచయాలు కలిగినాయో, దినదినాభివృద్ధిగా తన ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రోత్సహించే సాంగత్యం ఎంత దూరాన్ని ఉన్నా ఎలా సందర్భపడిందో, ఆ సాంగత్యంలో తమ ఆత్మీయత ఎంత గాఢంగా అంటుకు పోయిందో ప్రతివానికి చాలా చిత్రంగా కనబడుతుంది. తన ఉద్యోగం, తన యిల్లూ, పూర్వం తనకున్న మనస్సు కలిసిన మిత్రులనూ, తలచుకొని, ఈ పథంలోబడి నడచిన కొలదీ కలిగిన పరిణామంచూచుకుంటే

కొండంత భేదం కనబడుతుంది. ఒక గుంటలో ఉన్న చేప ఒకసర స్సులో బడినట్లు తోస్తుంది. అది నిజంగా ప్రభువు పెట్టిన భిక్ష.

ప్రభురూపంమీద చక్కని మమకారం, ప్రభునామంలో ఒక అవ్యక్త మాధుర్యం, ప్రభుని బిడ్డలతో ఒక అలౌకికమైన ఆప్తత, ఈవిధంగా ఒక రసహీనమైన జీవితాన్ని రసవంతంచేసే మహాప్రభువు శ్రీ కుసుమహరనాథుడు.

ప్రేమ అభావమైనస్వార్థం ప్రబలమై, మాయానటన అధికమై, ధనమే ప్రధానమైన యీ కాలంలో, సహజంగా మంచి గుణాలుకలిగీ విధిలేక సంఘబలిమినిబట్టి తోడివారి దుర్గు ణాలను అనుకరించనిదే జీవించటం సాధ్యంకాని యీదినాలలో ఈ విధంగా కంటికి రెప్పవలె కాపాడుతూ, మనను పరిచయం చేసుకుంటూ, ఎప్పటికప్పుడు సుసాధ్యమైన ఉపాయాలూ, సలహాలూ చెప్పుతూ, జీవితంలో ఏలాంటిపిసుగూ, నిరాశా కలుగ కుండా చేస్తూ, సత్సాంగత్యాన్ని ఏదినాని కాదినం పెంచుతూ, మన బాధ్యతలూ, భారాలూ, తన నెత్తిని వేసుకుని మోస్తూ, మనతో నడుస్తూ, మనని నడిపిస్తూ ఉండే ఆత్మీయుడు శ్రీహర నాథునికంటే యితరుడు ఎవడు కనబడతాడు?

శ్రీహరనాథమూర్తి ఉపదేశాలూ సలహాలూ ఎంతో సులభంగానూ సుసాధ్యంగానూ ఉంటాయి. మనధర్మానికి హాని కరంగా ఉండవు. మన జీవనానికి ఆధారమైన వృత్తికి హానికరం కావు. మన వేషాన్ని మార్చేవి కావు. బాహ్యజగత్తునకు మార్పు కనబరచేవి యేమీ లేవు. ఏమార్పుచేసినా అంతరంగం లో హృదయానిదే కాని బయటిది కాదు. బయటకు కనబడే మార్పు చేసుకోమని చెప్పడు సరికదా మీదుమిక్కిలి వద్దని

నచ్చచెప్పుతాడు. ప్రతిమంచి విషయానికి తన భక్తగణంలో వారిని ఎన్ని ఎన్ని చూపుతాడు. చెడ్డగుణాలలోపడి చెడిపోయిన వారికిగాను తార్కాణంగా తననే చూపుకుంటాడు, ఫలానా వాడు చాలా ఉత్తముడూ - వానితో - పరిచయం చేసుకొమ్మంటాడేకాని, ఫలానావాడు దొంగ - వాని పరిచయం వద్దని చెప్పడు. ఆ విషయంలో తననే చూపుకుని, 'నా యీ నా నామీద జాలిచూపించి నన్ను బాగుచెయ్యి - నా పతనావస్థకు జాలిపడి, నన్ను వదలిపెట్టకుండా ఉద్ధరించ గలిగేది నీవేసుమా' అని వేడుకుంటాడు.

'జీవులందరూ పరమేశ్వర సంతానమే, అన్ని జీవులూ నావంటివే అనేభావం కలిగితేనే పరమేశ్వర కృపాపాత్రుల మౌతాము.' ఈ వాక్యానికి మనం ఎంతదూరాన ఉన్నామో సర్వజీవులయెడ సానుభూతి........ సర్వజీవరాసుల యెడలా సానుభూతిమాట అటుంచగా తోడిమానవుని మీదసానుభూతి చూపించేశక్తి మనకు ఉన్నదా అని. కించిత్తు మనమాటకు ఎదురుచెప్పేవాడూ. కించిత్తు మనసుఖానికి అడ్డుపడేవాడూ ఉన్నప్పుడు మనం క్షమించి 'నా సోదరుడే' అనే భావంతో ప్రేమచూపు చూడగలిగిననాడు కదా పరమేశ్వర కృపాపాత్రులం! ఎంత నిస్వార్థబుద్ధి కావాలో చూడండి. మనదృష్టి యితరుల బాగోగులమీదకాక, కేవలం మన మీదనే నిల్పుకోగలిగిననాడు యీ గుణం అబ్బుతుంది. మన యెదుటి ప్రపంచంలో దిద్దుబాటులేదు. దిద్దుబాటు నాలోనేఉంది. నాలో శుద్ధ సత్వగుణం ఉంటే అది అమోఘంగా పనిచేస్తుంది. అనే భావంతో పరమేశ్వర లీలావిభూతినిచూస్తూ పరమేశ్వర

నామాన్ని స్మరిస్తూ 'ప్రతిమానవుడూ సంపూర్ణస్వేచ్ఛ అను భవించాలి. ఒక డొకనికి దాసుడెప్పుడూకాడు' ఈ పాఠం నేను బాగుగా వల్లించి అమలులోనికి తెచ్చుకోవాలి, అనేతాల్మి మనలో ఉదయించాలి.

ప్రతిమానవుడూ ఒక కృత్రిమమైన గౌరవప్రతిష్టకు అభ్యాసపడి, తనకుతానై ఒకఔన్నత్యాన్ని కల్పించుకుంటాడు. ఆ స్థితిలో ఉండి తనకు దిగువగా కనబడే జీవులని నీచదృష్టితో చూడటం ప్రారంభిస్తాడు. అక్కడనుండి ఆ జీవులను తనకు అను కూలంగా ఉండటానికి ఒత్తిడిచేయటం మొదలుపెట్టుతాడు. తన తెలివినీ నేర్పునూ, ఉపయోగిస్తాడు. అక్కడికీ అనుకూలం కాకపోతే అతితుచ్ఛమైన శరీరబలం ఉపయోగించి వాటిని నిర్మూలం చెయ్యటానికి పూనుకుంటాడు, వానియెడల లేనిపోని ద్వేషం వహిస్తాడు. మాత్సర్యం పెంచుకుంటాడు. కొంతవరకూ ప్రయత్నంలో సఫలత్వంపొంది తాను విజయగర్వం పొందు తాడు. తానేమో సత్కర్మచేయటం వలన ఉచ్ఛస్థితికివచ్చాననీ తనదృక్పథంలో ఉన్న తక్కువజీవులు దుష్కర్మఫలితంగా తక్కువస్థితిలో ఉన్నాయనీ తన కృత్రిమ ఔన్నత్యాన్ని సమర్థించుకుంటాడు. చివరకు పరమేశ్వరుని యిచ్ఛానుసారం మృత్యువు వాతబడి తాను ద్వేషించిన జీవులతోబాటు నిస్స హాయస్థితిలో పోతాడు. దీనికంతకీ మూలం తాను మొదటలో భావించి తెచ్చిపెట్టుకొన్న కృత్రిమ ఔన్నత్యమే.

పరమేశ్వర రచితమైన యీ విశాల ప్రపంచంలో నాకొక ప్రత్యేక స్థానమూ, మిగతా జీవులకొక స్థానమూలేదు. అంద రమూ సమానస్థాయిలో వాండ్రమే, అదే పునాదితో ఉంటే

ఆ జీవితం యీ మాదిరిగా ఉండదుకదా! ఏదికలవాడు అది లేని వానియెడల జాలిపడి సహాయపడగలుగుతాడు, సాను భూతృ[శువులు రాలుస్తాడు. ధనికుడు బీదవానిని దగ్గరకు తీసు కుంటాడు, అంగసౌష్టవంకలవాడు వికలాంగునికి తోడవుతాడు. అప్పుడు యీ ప్రపంచం యెంతసుందరంగా మారిపోతుందో! దీనుడు అనేవాడు కనబడతాడా? దీనినే ప్రభువు యెంత చక్కని ముద్దుమాటలతో బోధించాడో :— నాయనా ఒక తండ్రి తనకుగల సంతానములో ఒకనిని పిలచి, తన ఆస్తిని అతనివశముచేసి 'నీయన్నదమ్ముల రక్షణభారం నీదిసుమా' అని ఆధిపత్యం యిస్తాడట. కుటుంబంలోని వ్యక్తులను సమభావంతో చూస్తూ అందరిలోనూ తాను ఒకడై, తన బాధ్యతను గుర్తు నందుంచుకొని వ్యవహరిస్తేసరి— అట్లుకాక తనసుఖాన్నే చూచు కుంటూ, మిగిలినవారియెడల అలక్ష్యంచూపిస్తే, ఆ తండ్రి అతని నుండి ఆ యాధిపత్యంల్యాగివేసి ఆ కుటుంబంలో మరియొకవ్యక్తికి యిస్తాడట. అందువలన మొదటివ్యక్తి తాను యెన్నడూ భావింపని దీనస్థితికివచ్చి హతాశుడై దుఃఖాలపాలవు తాడట.... ఎంతస్వాభావసిద్ధమైన ఉదాహరణంచూపి శ్రీహరనాథుడు ప్రజానీకంలో దయాభావం ప్రవేశపెట్టుతున్నాడో.... అది ఆయనకే చెల్లింది.

ప్రతిమానవుడూ తనలో ఉప్పొంగుతున్న స్వార్థకాంక్షను తగ్గించుకునే ప్రయత్నంచెయ్యాలి. తనకు ఉన్నది పరమేశ్వర ప్రసాదంగా భావించాలి. తానుతిరుగుతూన్న వాతావరణంలోని ప్రతిజీవి పరమేశ్వరునకు ప్రేమాస్పదమైన సంతానమే అని గుర్తించాలి. ఆ జీవులన్నీ పరమేశ్వరుని వివిధరూపాలుగా

భావించాలి..... ఓహో, ఎంత గొప్పస్థితికి మన్ని తీసుకు పోవటా నికి పూనుకొని, మనమీద యెంత ఆశను పెట్టుకొని, ప్రభువు మన్ని చేపట్టినాడో చూడండి. వీనిఅన్నిటికి మనం సిద్ధపడి, 'ప్రభూ నన్ను వదలివేయకూ, నీకు సమర్పణమవుతున్నాను, కిం అన కుండా నీవెంట వస్తాను, నాజీవితరథాన్ని యెల్లామరలి స్తే అల్లా మరలుతానూ'అని ఆపాదపద్మాలమీదనే మనసుంచి వశమై నప్పుడుకదా నాయన మనస్సు ఆనందించేది!

ఏదియెప్పుడు ఎలాజరుపుతాడో అది ఆయనకే తెలుసు. మనకు తెలియనవసరంలేదు. "ప్రభువు మన జీవితాన్ని ఉద్ధ రించేవాడు" అనే దృఢవిశ్వాసం కలిగిననాడు లేనిపోని అను మానాలు పుట్టనేపుట్టవు. తండ్రి చేతిలో తన చేతినుంచి నడు స్తూన్న బిడ్డకు అనుమానాలు ఎందుకు పుట్టుతాయి? ఒక్కటే ధైర్యం. మానాన్న నావెంటనే ఉన్నాడు... నాకేమీ భయం లేదు........ ఆధైర్యంలో ఉండేబిడ్డ ఎన్నెన్ని చిత్రవిచిత్రాలు చూస్తాడో, తాను అదివరకు అనుభవించని ఎన్ని అనుభవాలు సంపాదిస్తాడో, తాను చక్కని అనుభవాలనుపొంది యితరులకు కూడా మార్గదర్శిత్వం వహింపగలిగిన సమర్థుడౌతాడో ... ఆజన్మమెంత ధన్యమైందో యోచిస్తేనే హృదయం వికాసం పొందుతుంది.

అన్నిటికిమూలం భగవన్నామోచ్చారణం. ఈ సాధన విరామం లేకుండా జరుపగల్గుతున్నప్పుడు మాయామేయమైన జగత్తంతా ఒకనాటకరంగంగా కనబడుతుంది. తాపత్రియాలు దూరంగా పారిపోతాయి. అవన్నీ ఒక క్రీడలోవచ్చే తాత్కా లిక ఘటనలుగా కనబడతాయి ఇంకా ఇంకా ఆడాలనిపిస్తుంది.

మనతోబాటుగా మనవలెనే ఆడటానికి వచ్చిన వ్యక్తులమీద మనకెందుకూ ద్వేషం? ప్రభుహరనాథుడు ఉపదేశించినవాటిల్లో ముఖ్యమైందీ- సూత్రప్రాయమైందీ ఒకటి. 'నాయనా, ఎవరి ఆట వారిని ఆడుకోనియ్యి. నీ ఆటమీద ధ్యానం ఉంచి దానిని చక్కగా ఆడు' అని. నిజం ఈనాటకరంగంమీదికి ఎవరిపాత్ర వారు అభినయించటానికి వచ్చారు. అంతా ఆనాటకసూత్రధారి యిచ్ఛానుసారం జరుగుతున్నది. అప్పుడు నాపాత్రను నేను పోషించుకుంటూ నేనాడి నాధర్మం నేను నెరవేర్చుకోవాలి. నాయాటనే మిగిలినవారందరూ ఆడాలి అని కాని, నాకిచ్చినది మంచివేషం కాదు. నేను ఆరాజ వేషాన్నే ధరించాలని కాని భావించటం చాలా మూర్ఖపుపని కాదా? ఆవిధమైనభావం పెట్టు కుంటే నాటకం యెలాగ కి కట్టుతుంది? అంతా వేషగాళ్ళే అనేభావం కలిగినప్పుడు వేషధారులమీద ద్వేషం యెందుకు పుట్టుతుంది? అశాంతి యెందుకు కలుగుతుంది?

ఓహో, శ్రీహరనాథుడు మనకెన్ను తెరపించి జ్ఞానోదయం చేయించిన మరొకవిషయం. ప్రతిజీవికీ ఒక్కటే అభిలాషట. అది శ్రీ పరమేశ్వర సన్నిధికి చేరుకోవటం అనేది. ఇదిజీవి యొక్క సహజమైన, స్వభావసిద్ధమైనకోరిక. ఈకోరికను సాధించుకొనుటకే జీవి ప్రయత్నించేది. ఒక మహదానందం ఎప్పుడో అనుభవించి ఉండటంవలననే ఆ ఆనందమాధుర్యంకోసం ప్రాకులాడేది. అది యీదృశ్యజగత్తులో లభ్యపడక, ఈ మనస్సు జగత్తులోని సర్వభోగపదార్థాలమీదికి వ్రాలడమూ, ఆభోగం శాశ్వతం కాకపోవటమూ, ఆతృప్తి అల్లాగే నిలచిపోవటమూ- ఇల్లా తిరిగితిరిగి విసిగి, వేసారి, యీ ఆనందం దృశ్యవస్తువులో

గాని దృశ్యపదార్థాలలో కాని లేదని నిశ్చయం అయిన తరు వాత కన్ను తెరచుకొని భగవత్పాదారవిందాలకోసం పాకు లాడటం సంభవిస్తుంది. సహజమైన యీకోరిక పాపంచిక సుఖాలవలన కప్పబడిపోయి తీవ్రత్వాన్ని కోలుపోతుంది. పర మేశ్వరుని కరుణచేత మాయావరణం కొంచెం సందిస్తే, తన నిజమైన లక్ష్యం యేదో స్ఫురణకు వస్తుంది. అటువంటి సత్యాన్ని ప్రభువు మనకు ముస్ముందుగా తెలియచేస్తు న్నాడు. 'నాయనా, నీ అసలులక్ష్యం అదిరా, నిప్పుమీదనివురు కప్పినట్లు ఆపరమ పవిత్రమైన కోరికను ఇహభోగ కాంక్షలు కప్పి నిన్ను భ్రమలో పడవేస్తున్నాయిరా. ఆ నివురును విసరి వేసి దాని అడుగునఉన్న అగ్నికణాలని ప్రజ్వాలింపచెయ్యటానికి భగవన్నామస్మరణమే సాధనంరా- ఆ నామసాధనంలో ఉన్న శక్తి మహత్తరమైందిరా. అందుకు నీకుసాయపడి నీకు కింకరుణ్ణి అయిపోయి నీ ప్రాపంచిక సంబంధమైన బాధ్యతలన్నీ నేను నాపైన వేసికొని చూస్తానురా ఆ సహజధ్యేయాన్ని సిద్ధింపచేసు కునే రాజబాటలో ముందుకుసాగి పవిత్రజీవనం గడపరా అని బ్రతిమాలుకుంటాడు.

పరమేశ్వర భక్తసాంగత్యంతో పరమేశ్వర నామసంకీ ర్తనం చేస్తూ, ఈలక్ష్యాన్ని మరువకుండా, ప్రపంచంలో మన ధర్మాన్ని నిరాడంబరంగా నిర్వర్తిస్తుంటే శాశ్వతానందం దొరుకుతుందంటే సందేహం యేముంది ?

ప్రభు హరనాథుడు మన సామాన్య జీవులకు జగత్ప్ర భుని గూర్చియిచ్చిన అభిప్రాయమే చాలా క్రొత్తది. పరమే శ్వరుడు నావాడు- నాకత్యంతప్రియుడు- నన్ను కండ్లలోపెట్టు

కుని ప్రేమిస్తున్నవాడు– నా శ్రేయస్సే అతనిధ్యేయం, నాకు నిత్యము వెంటనంటి తిరిగే సంగడీడు– నాకు మాటలునేర్పి నాచేత మాటలాడించేవాడు– నన్ను పరీక్షించి శిక్షించటాని కేర్పడ్డవాడు కాడు – నాతల్లి దండ్రిచూపే ప్రేమకు సహస్ర గుణాలు అధికంగా ప్రేమించేవాడు. నాసుగుణాలకు పొంగిపోయే వాడు. నాపొరపాట్లకు జాలిపడి నన్ను కడుపులో పెట్టుకుని కాపాడే వాడు. అనేభావం కలుగచేసినవాడు నాప్రభువు. జగత్ప్రభుని ప్రేమ యిట్టిది. జగత్ప్రభువు ఇట్టివాడు అని చూపుల్లో మాటల్లో. అన్నిట్లోనూ, ఉదాహరణంగా తానుండి ప్రభు ప్రేమను చవిచూపటానికి వచ్చిన భగవదవతారం కాకపోతే ప్రేమమూర్తి అయిన యీ హరనాథుడెవ్వరు ?

ఇంతవరకూ మనం భగవానుని మహనీయతనే భావించి దానినే పూజించటానికి అలవాటుపడ్డాం. కాని భగవానుని విశ్వ మయతనూ. భగవానునికీ మనకూగల ఆత్మీయతనూ గుర్తించి అతనిని ప్రేమించటం యెరుగం. నాస్వామి శ్రీహరనాథుని అను గ్రహవిశేషంవలన ఆజ్ఞానం లభించింది. అల్పమనస్కులు, అజ్ఞా నులు దుర్బలులూ, అయిన మనబోటి కలిజీవులకు హృదయపూ ర్వకంగా భగవత్సేవచేసుకుని శాశ్వతానందం పొందటానికి శ్రీహరనాథుని పరివారంలో చేరడంకంటే తరణోపాయం ఏముంది ?

స్వానుభవంతో చెప్పుతున్నాను. శ్రీహరనాథ బంధు కోటితో కలవాలని పోయే ముందరకలిగే ఉత్సాహం– ఇంక అయిదునిముషాల్లో ఆపరివారాన్ని కలుసుకుంటాను–అనేస్థితిలో మనస్సులో కలిగే ఆత్రం– 'జై హరనాథజై కుసుమకుమారిజై'

అని పెక్కు కంఠాలలోనుండి మిన్ను ముట్టేలాగు వస్తున్న నామ గానం దూరాన్నుండి వినబడుతున్నప్పుడు అక్కడనుండి ఆస్థానానికిగలదూరం యెప్పుడు తరిగిపోతుందా-రెక్కలుంటే యెగిరి అక్కడ వ్రాలుదునుకదా అనేసంతాపం- కొద్దిదూరంలో కనబడుతున్న ప్రభుని బిడ్డలు కంటబడగానే చూపును అవరోధంచేసే అశ్రుప్రవాహం- 'బాబా,' 'నాన్నా' 'తండ్రీ' అంటూ యింకా గజందూరం ఉండగానే ఒక్కగంతులో మీదికురికి అతిగాఢంగా పెనవేసుకుపోయేటట్లు చేసుకునే ఆ ప్రేమాలింగనాలు, ఆస్థితిలో నీరుగ్రమ్మి గ్రుడ్డిగా ఆయిపోయిన నేత్రాలతో చూపులో చూపుగుచ్చి చూచుకంటూ ఏమో అనబోయి స్పష్టంగాకంఠాన్నుంచి మాటపైకిరాక హా.' 'ఓహో' 'ఉస్సు,' 'ఇస్సు,' అంటూ పైకివచ్చే ప్రేమధ్వనులు- ఇంకా- ఇంకా చెప్పటానికి మాటలు దొరకని ఆస్థితి నాప్రభువు యిచ్చిన మహాభాగ్యం. ఈ భాగ్యం నాప్రభుకుటుంబంలోనే ఉన్నదని నానమ్మకం.

ఇక ఆ భక్తపరివారం - కాదు కాదు-దాన్ని ఏ పేరుతో పిలవాలో చేతకావటంలేదు- దానిని వదలి ఇంటికి పోయేటప్పుడు పొందే వియోగబాధ - పూర్తిపరివారంలో ప్రతి కంటి నుండీ కాల్వలుకట్టి ప్రవహించే కన్నీటిధారలూ, ఇంటికిచేరిన కొంతకాలం వరకూ మరపురాని ఆరోదనధ్వనులూ, ఒకరికొకరు దూరమౌతూ, నడకముందుకు నడుస్తూ, చూపులు వెనుకకు పెట్టుకొని చూపుమేర దాటిపోయేవరకూ చేయి ఊపుతూ, విడువలేక విడువలేక తెలిపే ఆ వీడ్కోలులూ, ఈ ప్రేమానందం, ఇంత చౌకగా ఎక్కడ లభిస్తుంది ?

ఇది నిజంగా నాటిగోకుల బృందావనంలో శ్రీకృష్ణ

సహితులైన గోపికా గోపకులు త్రాగి, స్నానమాడి, ఈది, మురకలుపెట్టిన ప్రేమామృత ప్రవాహాల చిన్నెలుకావా? ఈ యనుభవాలను కలిగిస్తూ ఆ ఎర్రని తామరపూవుల్లో నిలిచి, ఎడమచేతితో అధోభాగాన్నీ, కుడిచేతితో ఊర్ధ్వాన్నీ చూపిస్తూ ముఖంలో ఆ వేదనను ప్రకటిస్తూ, నిలబడిన పురుషమూర్తి, వాత్సల్య రసాన్ని గుమ్మరిస్తూ, రూపొందిన మాతృత్వమో అనునట్లు నిలిచిన స్త్రీమూర్తీ, ఎవరని చెప్పాలి? ....ఏమో ఏమో.... వారికి ఏమిపేరుపెట్టినా అతికేటట్లు తోచటంలేదు. వారెవ్వరో వారికే తెలియాలి - మన హృదయాలకే తెలియాలి. అది అనిర్వచనీయం. అవాఙ్మానస గోచరం, అలౌకికం అంతే....

శ్రీ హరనాథ బృందావనంలో చేరితే దొరికేవి ఏమిటని ప్రశ్నిస్తే చెప్పండి. ఎక్కడాలభించని ప్రేమాశ్రుధారలూ, మాయమర్మాలు మరచి ప్రేమ మకరందాన్ని వర్షించే హృదయారవిందాలూ, నిట్టూర్పులూ, గద్గదకంఠస్వరాలూ, ఒడలి పులకలూ, ప్రేమాలింగనాలూ, శ్రీ హరనాథ జయ జయ ధ్వానాలూ, మైమరపులూ.

లోకదృష్టిలో యివన్నీ కించిత్తుకూడా విలువలేనివైతే అవనియ్యండి. కాని ఎందుకో హృదయాలు ఈ అనుభవాల కోసం పరితపిస్తాయి. వీటివిలువ నిత్యం ఐహికమైన పరువు ప్రతిష్ఠలలో, భోగ భాగ్యాలలో, అధికార గర్వాలలో, మునిగితేలే వ్యక్తులకి తెలియదేమో; కాని-వారే-ప్రభుకరుణా విశేషం చేత, ఏదో మిషమీద యీ రంగాల్లోకి రావటం తటస్థిస్తే, కించిత్తు యీస్మృతి తగిలి కొన్ని క్షణాలైనా, వారిలో ఎక్క-

డనో, ఏమూలనో అణగిపోయి, పైకి రాలేక కొట్టుకుంటూన్న పరిశుద్ధ ప్రేమరసం, పైనున్న ఐహిక వాసనలనే బండరాళ్ళను బ్రద్దలుకొట్టుకుని బయటకు రాకపోదు. కొన్ని క్షణాలైనా ఒళ్ళుమరచి ఆనందించకమానరు. అది వాళ్ళ అదృష్టాన్నిపట్టి ఉంటుంది. నా ప్రభువు కృపనుపట్టి ఉంటుంది.

శ్రీహరనాథ ప్రభుని దివ్యలీల.

# ఆయురారోగ్యాలు ఎందుకు?

జ్యేష్టాషాఢమాసాలు అప్పుడప్పుడే గడచాయి. గ్రీష్మాదిత్యుని ప్రభావం చాలవరకు తగ్గిపోయింది. తన ప్రచండ కృత్యాలు జ్ఞప్తికి వచ్చి పశ్చాత్తాపం పుట్టిందా అన్నట్లు సూర్యబింబం యెఱ్ఱబడిపోయింది. పడమటి దిక్కున అస్తమయాన్ని సమీపిస్తోంది.

ఒక జమీందారు బంగారుపాలకి కొద్ది పరివారంతో బయలుదేరింది....దారిప్రక్కల చెట్లవరుసలలో దోబూచులాడుతూ పోతూంది. పాలకినుండి కాబోలు చక్కని సువాసనలు దారి నంతటినీ అలుముకుంటున్నాయి. ఆసుగంధంలో కొద్ది పరిమాణంతో కొద్ది చెడువాసన నేను కూడా ఉన్నాను సుమా అంటూ ఉన్నది....బలవంతులమధ్య ఉన్న బక్కవాని లాగు.

పరివారంలో స్త్రీలూ, పురుషులూ ఉన్నారు. అలంకారాలు చేసుకున్నా వారి ముఖాలలో విచారభావాలు కనబడుతున్నాయి.

ఆదారి పోయిపోయి తనకు అడ్డంగావచ్చిన మరొక పెద్ద దారిని కలుసుకుంది. అక్కడ ఆపాలకిని దింపారు బోయీలు.... కాని లోపలివ్యక్తి బయటకు రాలేదు....సాయం సూర్యుడు పడమటిగట్టును అందుకోబోతున్నాడు.

ఆ పెద్దదారిమీదుగా వస్తూ ఉన్నాడు మహాప్రభువు. సాత్వికగుణం యీ విధంగా రూపొందిందా అన్నట్లు ముఖంలో, చూపులో, నడకలో ప్రకటపడుతూ ఉంది. ఆ పెద్దపెద్ద నేత్రాలలోనుంచి దయారసం కురుస్తూ ఉంది. బంగారుఛాయ శరీరం.... తెల్లని వెండ్రుకలతో పొడుగుగా పెరిగిన గడ్డం.... విశాలమైన నుదురూ....చూచేవారి హృదయాలలోకి చొరబడి ముద్రపడి పోయేలాగు ఉన్నది ఆయాకృతి........

పంక్తులు తీరియున్న చెట్లమీదిపక్షులు ఆ ప్రభుని జయ గానం చేస్తున్నాయా అన్నట్లు కిలకిల లాడుతున్నాయి....దారిని కప్పుతూ ఉన్న చెట్లకొమ్మలు స్వాగత మిస్తూన్నట్లు వంగిలేస్తూ న్నాయి. బాహ్య సంబంధమైన రాజ లాంఛనాలు లేకపోయినా అతనిని ప్రకృతి మహారాజరాజేశ్వరునిగా అంగీకరిస్తూంది. భూదేవి ఆ సుకుమార పాదపద్మాలను తన ఒడిలో పెట్టుకుని తనవంటి ధన్యురాలు లేదని గర్విస్తూంది.

జగత్ప్రభునితో కూడ కొద్దిపరివారం ఉంది. ప్రభువు పాలకిని సమీపించాడు. బోయీలు లోపలనున్న జమీందా రును బయటకు తీసే ప్రయత్నాలు చేస్తున్నారు.

పాపం....అతడు చాలా దుస్థితిలో ఉన్నాడు. లేచి నిల బడేశక్తి లేదు. శరీరం మొత్తం వ్రణాలతో నిండిపోయింది...

చీము నెత్తురుతో కట్లు తడిసి పోయాయి. ఆ దుర్గంధాన్ని చంప టానికి లెక్కలేని అత్తరుబుడ్లు పగులగొట్టి మీదజల్లారు పన్నీటి వర్షం కురిపించారు...ఏమి చేసినా ఆ దుర్గంధం తన యాధిక్యం చూపుతూనే ఉన్నది.

రాజాగారిది ఆజానుబాహు శరీరం......పొడుగుకు తగిన లావు....రోగ కారణంగా కుదించుకుని పోయింది. అర్వై నమీపిస్తున్న వయస్సు. ఒక పెద్దమూట బయటకు వచ్చినట్లు, బోయీల సహాయంతో జగత్ప్రభువున్నిధికి చేరాడు రాజా...

రాజా పరివారం దుఃఖాశ్రువులు రాలుస్తూంది...కాని దుర్గంధానికి జడిసి తగినంత దూరాన్ని నిలబడిపోయింది....

దీనజన కల్పతరువు – ప్రభువు రాజా వీపును తట్టుతూ మోకరించి తన మడమలమీద కూర్చున్నాడు. ఆ సువిశాల నేత్ర పద్మాలనుండి ప్రేమాశ్రువులు ప్రవహిస్తున్నాయి. ఆ చల్లని చూపులగుండా యేదో అమృతధార రాజా చూపుల లోనికి నిర్విరామంగా పోతూంది. వీపుపై ఉంచిన ప్రభుని కుడి చేయి యేదో జీవశక్తిని రోగి శరీరంలోనికి చొరపెట్టుతూ ఉంది. ఇక హృదయాలేం యిచ్చి పుచ్చుకుంటున్నాయో అది వారికే తెలుకపడాలి....

జమీందారు దుఃఖం యినుమడించింది...ఆ సముద్రం గట్టుమీరిపోయింది...ఆపాదమ స్తకంవణకిపోతూంది....గొంతుక నుంచి రాలేక రాలేక మహాకష్టంతో బయలుదేరి పెదవులను దాటి బయట పడుతున్నాయి "ప్రభూ....ప్రభూ" అన్న హృదయపూర్వక సంబోధనలు.......

ప్రభువు తన చేతులతో అతని కన్నీటిని తుడిచాడు...
ప్రభుని ప్రేమాశ్రుబిందువు లొకటి రెండు రాజా బుగ్గలమీద రాలాయి. "బాబా....ఎందుకు అంత దుఃఖపడతావు? ఎందుకూ అంతభయం ? నీ కేంకావాలి తండ్రీ?" అని బుజ్జగిస్తూ అడిగాడు......

అంత దుస్థితిలో ఉన్న వాని కేం కావాలో ఆ మహా ప్రభువుకు తెలియదా? మరియెందుకు ఆ ప్రశ్న ?

రాజా వేయిపుట్ల దుఃఖాన్ని బయటకు పొంగకుండా మింగుతూ "బాబా....నా దుస్థితి నీకు ప్రత్యక్షంగా కనపడుతూన్నదికదా .......ఆయురారోగ్యాలు ప్రసాదించు బాబా...." అని భళ్ళున యేడ్చాడు. అక్కడి భూభాగాన్ని తన కన్నీళ్ళతో తడిపివేశాడు.

•

మళ్ళా ఆ కృపామూర్తి అతని కళ్లు తుడుస్తూ రాజా తలను తన రొమ్మున కానించుకుని "ఆయురారోగ్యాలు కావలెనా తండ్రీ ! ఆయురారోగ్యాలు ఎందుకు బాబా" అని ప్రశ్నించాడు.

ఎంత విచిత్రమైన ప్రశ్న ! ఎందుకు?.......ఆయురారోగ్యాలు ఎందుకూ....ఏమి ప్రశ్న యిది? .......ఈ ప్రశ్నకు జవాబు ఏమి చెప్పాలి ?

పరీక్షకుపోయిన విద్యార్థి తన ప్రశ్నపత్రంలో తాను చదివి సిద్ధపడని ప్రశ్నను చూచుకుని తబ్బిబ్బై పోతున్నట్లుంది రాజాస్థితి.

నాకు ఆయురారోగ్యా లెందుకు?...ఈ ప్రశ్న అతనిజీవిత గ్రంథం పాత పేజీలన్నిటినీ ఒక్కసారి తిరగవేయించింది.

ప్రాపంచికంగా అతడు ఆడని ఆటలేదు. అనుభవించని భోగంలేదు. తన జీవితగ్రంథంలోని ప్రకరణాలశీర్షికలన్నీ పెద్దపెద్ద అక్షరాలతో కళ్ళముందుకు వస్తున్నాయి. ఎంతటి మహాబలశాలురను తన దాసులుగా చేసికొనినాడో—అచ్చరలవంటి బంగరు బొమ్మలను బలవంతముగా కొనిపోయి తన బానిసలుగా చేసుకొనినాడో...చూపుమేరదాటిన యెంత భూభాగం మీద "ఇది—రాజాది" అనే ముద్ర వేసినాడో...తన యోగమనాన్ని నిరీక్షిస్తూండేలాగు ఎన్నివేలమందిని నిలబెట్టి ఉంచేవాడో....గూఢచారులను నియమించి తన శాసనంలోని అన్యాయాలు విమర్శించిన యెంతమంది దీనాత్ముల ప్రాణాలుతీయించినాడో అన్నీ ఆమనస్సులో తిరిగి పోతున్నాయి....ఏ కోశానో చిన్న మంచిపనులు గరికిపోచల్లాగ పడిఉన్నా వానిమీద కొండనంటిపోయే గడ్డిమేట్లు కప్పివేశాయి........

ఎందుకు?....ఆయురారోగ్యాలు ఎందుకు? "టైం" అయిపోతూన్నది.......పాపం........ఆ ప్రశ్న పత్రంలో మరి ప్రశ్నలు లేవు.......

దినపతి అంత వృద్ధదశలోను తన అస్తమయానికి దుఃఖిస్తూ కూడా యీ జనపతి జవాబును చెవిని వేసుకొని పోదామని సగం దిగిపోయి సగం మిగిలాడు. గ్రీష్మర్తువులోని తనజీవితానికి రాజాజీ జీవితం సరిపోల్చుకుని తపిస్తూ తపిస్తూ క్రుంగి క్రుంగి క్రుంకిపోయాడు.

ఏం చెప్పుతాడు రాజా ? ఎందుకూతనకు ఆయువు ? ఇంకా ప్రపంచాన్ని యేలటానికా ?... ఇంకా భోగాలని భోగించటానికా ? ఇంకాయింకా చండశాసనాలతో తోడిజీవులను అణచివేయటానికా?.... జవాబుకోసం వలిబిలి అయిపోయాడు.

ప్రభుని కన్నులలోనుండి ఒక చేతనశక్తి అతని హృదయంలో చొరబడింది. అది ఆ హృదయంలో నిద్రపోతూ కొనప్రాణంతో కొట్టుకుంటూ ఉన్న మానవత్వాన్ని మేలు కొలిపింది.

రాజా కన్నులు కొంచెం తేజోవంత మయ్యాయి. ఆ బుగ్గలమీద చిన్న హాసరేఖ ప్రకటమైంది.

అతడు ఇలా అన్నాడు— "బాబా....నీప్రశ్నతో నా మనోమాలిన్యం పశ్చాత్తాపాగ్నిలో భస్మమయి పోయింది. ప్రభూ, ఇప్పటికి యీ జీవితంలో ఒక్క సౌఖ్యాన్నే రుచి చూడ గలిగాను. దాని ప్రతిఫలం అనుభవిస్తున్నాను. దీనికి రెండవ భాగం ఉన్నట్లే యెరుగను. నీ ప్రశ్నవలన దీనికి రెండవభాగ మున్నట్లు జ్యోతకమైంది .... ఆ మహదానందం రుచి చూడా లనిపిస్తోంది.... నీ అనుగ్రహంవలన ఆయురారోగ్యాలు లభిస్తే దీనిని పూర్తిగా నీకు సమర్పణం చేసుకుని శాశ్వతానందం పొందుదామనీ, మానవసేవలో జీవితం గడుపుదామనీ నీనామ గానంలో చివరి ఊపిరి వదలుదామనీ యింకా యేమేమో ఆశలు బయలుదేరుతున్నాయి. తండ్రీ నీ ఇచ్ఛ... సప్రాణంగా నీ అధీన మౌతున్నాను."

ప్రభువు చిరునవ్వు నవ్వాడు .... అతని సర్వాంగ శరీరాన్ని తన హస్తాలతో స్పృశించాడు "నాయనా, తీవ్రమైన యీ నీ కోర్కె నెరవేరకపోదు. భగవానుడు తప్పక ఫలింపచేస్తాడు" అని ప్రేమపూర్వకంగా ఆలింగనం చేసుకొన్నాడు.

